శ్రీ

# ఆంధ్రమహాభారతము

(సభాపర్వము)

సంపాదకులు :

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ – సైఫాబాద్ – హైదరాబాదు-4.

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ-మంత్రి-వర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలె నని నిశ్చయించినది. తెలుగు భాషలోని పూర్వ గ్రంథ సముదా యము ఈ నాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుట లేదు. ఈ లోటును తీర్చి ప్రాచీన గ్రంథ సంచయ మును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమి ఒక ప్రణాళి కను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్ర మము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన ; రెండవది మహాభారతము ప్రచురణ ; మూడవది హరివంశము, భాస్కర రామాయణము, బసవపురా ణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట. పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతి గ్రంథములో గ్రంథ కర్తనుగూర్చి, గ్రంథప్రాశస్త్యమునుగూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తియైనది. సంక్షిప్త గ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కర రామాయణ, హరివంశ, భోజరాజీయ ములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్రమహాభారత ప్రకట నము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే మహాభారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్రమహాభారత సంపుటములలో రెండవదైన సభా పర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మా కందజేసిన డా. దివాకర్ల వేంకటావధానిగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథసంపుటాల వ్రాతప్రతులను సిద్ధముచేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదలకూడ చేసినవి. అందుకు అకాడమి పక్షాన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధముచేసి, ఆంధ్ర పాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు,
24-12-1970.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి.

# ఉపోద్ఘాతము

కృష్ణద్వైపాయన వ్యాసుఁడు సంస్కృతమున రచించిన మహాభారత మును గవిత్రయమువా రాంధ్రీకరించి యుండిరి. వారిలో మొదటివాఁడు నన్నయభట్టారకుఁడు. ఇతఁడు క్రీ. శ. 1022 నుండి 1061 వఱకును రాజ మహేంద్రవరము ముఖ్యపట్టణముగా వేంగీదేశమును బాలించినవాఁడును, పూర్వచాళుక్యవంశ చూడామణియునైన రాజరాజనరేంద్రున కనురక్తుఁడును కులబ్రాహ్మణుఁడునై యాతనియాస్థానమునందుండిన మహాకవి. తనకు మిత్రుఁడును ప్రభువునైన యారాజు ప్రేరణచే నతఁడు మహాభారతమును 'దెనుఁగున రచియించుట' కారంభించి, యందు మూఁడవదియైన అరణ్యపర్వమున మూఁడాశ్వాసములపై నూటనలువది రెండుపద్యములు రచించి దివంగతుఁడయ్యెను. తరువాత క్రీ. శ. 13వ శతాబ్దిలో నెల్లూరు రాజ్యమును బాలించిన మనుమ సిద్ధికి మంత్రియు నాస్థానకవియునైన తిక్కనసోమయాజి నాల్గవదియైన విరాటపర్వ మాదిగాఁ బదునైదు పర్వములను రచించెను. పిమ్మట క్రీ.శ.14వ శతాబ్దిలో శంభుదాస బిరుదాంకితుఁడైన ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ వ్రాయఁగా మిగిలిన అరణ్యపర్వశేషమును బూరించెను. ఈ విధముగాఁ దెనుఁగునఁ బంచమవేదమైన మహాభారతము నాంధ్రీకరించిన యీ మూగురు కవులును గవిత్రయ మనుపేరఁ బ్రశస్తిగాంచి యనంతర కవులెల్లరికి నొజ్జబంతులై యుల్లసిల్లిరి.

వ్యాసమహర్షి భారతమును శతపర్వ సమన్వితముగా రచించి తరువాత నావందపర్వములను పదునెన్మిది పర్వములుగా సంగ్రహించినట్లు "తతోఽష్టాదశభిః పర్వైః సంగృహీతం మహర్షిణా" అను శ్లోక భాగమువలనఁ దెలియుచున్నది. కాని పర్వ సంగ్రహపర్వము నందలి

> "ఏతత్పర్వశతం పూర్ణం వ్యాసేనోక్తం మహాత్మనా
> యథావ త్సూతపుత్త్రేణ లోమహర్షణినా పునః
> కథితం నైమిశారణ్యే పర్వాణ్యష్టాదశైవ చ"  1–2–70

అను శ్లోకమువలన నష్టాదశ పర్వవిభజనమును సౌతి కావించెనేమో యని

యూహించుట కవకాశము కలుగుచున్నది. కొన్ని దాక్షిణాత్య ప్రతులలో సంస్కృత భారతము పదునెన్మిది ప్రధాన పర్వములుగాఁ గాక యిరువది నాలుగు ప్రధాన పర్వములుగా విభజింపఁబడినట్లు కనవచ్చుచున్నది. ఒక్క ఆదిపర్వమే యందు ఆది, ఆస్తీక, సంభవ పర్వములను మూఁడు పర్వములుగా విభక్తమైయున్నది. నన్నయభట్టు పర్వానుక్రమణికా పర్వసంగ్రహములందు వంద యుపపర్వములను బదునెన్మిది ప్రధాన పర్వములను బేర్కొని యుండెను. ఆంధ్రభారతమున నష్టాదశ ప్రధానపర్వ విభజనమే కనవచ్చు చున్నది. ఆ అష్టాదశ పర్వములలో రెండవది సభాపర్వము. పర్వసంగ్రహ మున నన్నయభట్టు దాని నిట్లు వర్ణించియుండెను.

"మఱియు ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ, గింకర దర్శనంబును, నారదువలన లోకపాల సభాశ్రవణంబును, రాజసూయ మహాధ్వరారంభం బును, జరాసంధవధయును, గిరివ్రజ నిరుద్ధులైన రాజులఁ గృష్ణుండు విడిపించుట యును, దిగ్విజయంబును, రాజసూయంబు, నర్ఘ్యాభిహరణంబును, శిశుపాల వధయును, రాజసూయ విభూతికి దుఃఖితుండై సభాస్ఖలితుండై యున్న దుర్యోధనుం జూచి ద్రౌపదీ భీమసేనులు నగుటయును, తత్కారణంబున జూదంబాడుటయు, నందు శకుని కైతవంబున ధర్మరాజపరాజయంబును, ద్యూతదుఃఖార్ణవ మగ్నులైన పాండవులం బాంచాలి యుద్ధరించుటయును, బునర్ద్యూత పరాజితులై పాండవులు వనవాసగతు లగుటయు నను వృత్తాంతం బుల నొప్పి నాలుగువేలున్ మున్నూటపదునొకండు శ్లోకంబులు గలిగి

"పర్విసభా ప్రభృతిగ నవ, పర్వములను విస్తరిల్లి పండితచేతో
నిర్వృతిఁ జేయుచు రెండవ, పర్వము నారమ్యమగు సభాపర్వమిలన్"

1. సభాపర్వము, 2 మంత్రపర్వము, 3. జరాసంధవధ పర్వము, 4. దిగ్విజయ పర్వము, 5. రాజసూయ పర్వము, 6 అర్ఘ్యాభిహరణ పర్వము, 7. శిశుపాల వధపర్వము, 8. ద్యూతపర్వము, 9. అనుద్యూత పర్వము అను తొమ్మిదియు నిందలి ఉపపర్వములు.

పర్వసంగ్రహ కథనమునుబట్టి నన్నయ యుపయోగించిన సంస్కృత సభాపర్వపు ప్రతిలో 4311 శ్లోకము లున్నట్లు తెలియుచున్నది. శ్రీ పి.పి.యస్. శాస్త్రిగారిచే సంపాదితమై వావిళ్ళ వారిచే ముద్రింపఁబడిన ప్రతిలో సభాపర్వ

శ్లోక సంఖ్య 4511గా నీయఁబడినది. పూనా యందలి భండార్కరు ప్రాచ్య పరిశోధన సంస్థవారు ప్రకటించిన ప్రతిలో ఈసంఖ్య 2511గా చెప్పఁబడినది. ఇందు మొదటిది దాక్షిణాత్య ప్రతులకును, రెండవది ఔత్తరాహ ప్రతులకును ప్రతినిధులని భావింపవచ్చును, సభాపర్వ శ్లోకసంఖ్య విషయమున నీరెండింటికిని రెండువేల శ్లోకముల వ్యత్యాసము కానవచ్చుచున్నది. ఈ వ్యత్యాసమునకు దక్షిణ ప్రతులలో నతిదీర్ఘములైన మూఁడు నాలుగధిక పాఠములును గొన్ని పునరుక్తులును నుండుట కారణము. అధిక పాఠములలోఁ బ్రధానమైనది శిశుపాలవధ ఘట్టమున 35, 36 అధ్యాయముల నడుమ నున్నది. ఇది శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారి ప్రతిలో నేడధ్యాయములుగ విభజింపఁబడి యున్నది. భండార్కరు పరిశోధన సంస్థవారి ప్రతి యందలి అనుబంధము ననుసరించి యిందు 806 శ్లోకములున్నవి. భీష్ముఁడు శ్రీకృష్ణుని మహత్త్వమును శిశుపాలునికి వివరించుట యిందలి విషయము. ఇట్లే 20వ అధ్యాయమున జరాసంధుఁడు భీమార్జునులను నిరసించి వారిని జంపెదనని పల్కు సందర్భమున 10 శ్లోకములతోఁ గూడినదియు, కృష్ణబలరాములు పుట్టి కంసుని సంహరించుటను వర్ణించు సందర్భమున 39 శ్లోకములతోఁ గూడినదియు రెండధిక పాఠములు కనవచ్చుచున్నవి. 23వ అధ్యాయమున సహదేవుఁడు దక్షిణ దిగ్జైత్రయాత్ర యొనరించుచు ఘటోత్కచుని లంక కరిగి విభీషణుని నుండి కప్పము తెమ్మని పంచుట, యాతఁ డరిగి విభీషణ సత్కృతుఁడై యతఁ డిచ్చిన కానుకలు తెచ్చుట మున్నగు విషయములతోఁ గూడిన 135 శ్లోకములుగల మఱియొక యధికపాఠ మున్నది. ఈ యధిక పాఠము లేవియు నుత్తర ప్రతులలోఁ గానరావు. వీనికిఁ దోడు దక్షిణ ప్రతులందుఁగల కొన్ని పునరుక్తులును శ్లోక సంఖ్యయందలి వ్యత్యాసమునకుఁ గారణములైనవి.

ఖాండవవన దహన సమయమున రక్షితులైన యార్గురిలో నముచి దనుజు ననుజుఁడును శిల్పకలాకుశలుఁడు నైన మయుఁ డొకఁడు. ఇతఁడు తన్నర్జును డగ్నినుండి రక్షించిన మహోపకారమునకుఁ గృతజ్ఞతాబద్ధుఁడై కృష్ణుని ప్రేరణమున యుధిష్ఠిరున కపూర్వమైన యొక సభ నిర్మించి యిచ్చుటతో సభాపర్వ మారంభించు చున్నది. ధర్మజుఁ డంపొక శుభ ముహూర్తమునఁ బ్రవేశము కావించి యా సమయమున కరుదెంచిన మహా మునుల వలన ధర్మకథలు వినుచు సుఖముగాఁ గాలము పుచ్చుచుండ నొక

నాఁడు నారద మహర్షి యరుదెంచి, యాతని వలన రాజనీతి విషయము లడిగి తెలిసికొని, యిట్టిసభ నెందైనఁ జూచి యెఱుంగుదురే యని యడిగిన యాతని కింద్ర యమ వరుణ కుబేరులయు బ్రహ్మ యొక్కయు సభలను వర్ణించి చెప్పెను. ప్రసంగవశమున నాతఁడు యమసభాగతుఁడైన పాండు రాజు ధర్మజుని రాజసూయ యాగము చేయుమని కోరుట నెఱింగించెను. ధర్మరాజు రాజసూయయాగము చేయ నిశ్చయించెను. కృష్ణ ప్రేరణమున భీముఁడు జరాసంధుని సంహరించెను. భీమ పార్థ నకుల సహదేవులు పూర్వో త్తర దక్షిణ పశ్చిమ దిగ్విజయము కావించి యాయా దిక్కులనేలు రాజుల నుండి కప్పములు గొనివచ్చిరి. రాజసూయయాగానంతరము ధర్మరాజు భీష్మోపదిష్టుఁడై మయసభాభవనమునసే శ్రీకృష్ణున కర్ఘ్యమొసంగెను శిశు పాలుఁడు శ్రీకృష్ణు నధిక్షేపించి యాతనిచే నిహతుఁడయ్యెను. రాజసూయ యాగము చూడ నరుదెంచిన దుర్యోధనుఁడు సభావిభవము చూచు వేడుక నా యాయి ప్రదేశములఁ గ్రుమ్మరుచు వివృతద్వారము సంవృతముగా వగచి చొరనొల్లకయు, సంవృతద్వారము వివృతముగా వగచి చొరఁబోయి లలాట ఘట్టిత గృహద్వారుఁడయియు, సమప్రదేశ మున్నతముగా వగచి యెక్కనకట్టియు, నీలాశ్మరశ్మిస్థగితమైన విమలమణి స్థలము జలాశయ ముగా వగచి పరిధాన మెగఁద్రోచికొనియు, స్ఫటికదీప్తి జాల పరివృతమైన జలాశయము స్థలముగా వగచి కట్టిన పుట్టము తడియం జొచ్చియుఁ గ్రమ్మ ఱిన నాతనిఁ జూచి పాంచాలియుఁ బాండుకుమారులును నవ్విరి. అది యెఱిఁగి ధర్మరాజు భీమునిచే నతనికి దివ్యవస్త్రములును దివ్యభూషణము లును బంపించెను దుర్యోధనుఁ డట్లు సభాప్రలంభమునకు లజ్జితుఁడై పాండ వులను వీడ్కొని హస్తినాపురమున కరిగి సకలజన మనోనయనోత్సవమైన తత్సభాలక్ష్మి తన మనోనయనముల కగ్నిజ్వాలయై మహాదాహముచేయ సంతప్తుఁడై శరీరకార్శ్యమునొందెను. శకుని యాతని నోదార్చి మాయా దురోదర వ్యాజమునఁ బాండవుల సంపద యంతయు నపహరించి యిత్తు ననియు, నందుకు ధృతరాష్ట్రు ననుజ్ఞానము వడయు మనియుఁ బలికెను. దుర్యోధనుఁడు పాండవుల వైభవమును దన మనస్సంతాపమును దండ్రి కెఱింగించి శకుని యుపాయమున కనుజ్ఞ యీ వలసినదని తండ్రిని బ్రార్థిం చెను. ధృతరాష్ట్రుఁడు తొలుత జూదమున కంగీకరింపకయుఁ గుమారుని మనస్తాప మపనయింప రమ్యమైన యొక సభ నిర్మింపఁజేసి యందు జూదమా

డుటకై ధర్మజుని దోడ్కొని రమ్మని విదురుని బంపెను. ధర్మరాజు దైవ నియోగమున విదురునితో హస్తినాపురమునకేగి యా సభయందే శకునితో జూదమాడి రాజ్యసంపదలతోపాటు తమ్ములను ద్రౌపదిని సందొడ్డి యోడి పోయెను. ఆ సభయందే దుశ్శాసనుడు ద్రౌపదిని గట్టినపుట్టంబు లొలిచి యవమానించెను. తరువాత ధర్మరాజా సభయందే శకునితో రెండవమాఱు జూదమాడి యోడి యప్పుడు చేసికొన్న సమయము ననుసరించి భార్యానుజ సహితుఁడై యడవికేగెను. ఈ విధముగా సభాపర్వమునందలి కథ యంతయు నాద్యంతము సభాసంబంధియై యున్నది. ఇందుఁ బ్రసక్తములైన సభలేడు— మయసభ, ఇంద్ర యమ వరుణ కుబేరుల సభలు, బ్రహ్మసభ, ధృతరాష్ట్రుఁడు నిర్మింపఁజేసిన సభ. దిక్పాలకాదుల సభల వర్ణన ప్రసంగము ధర్మజ రాజ సూయ యాగాచరణమునకు హేతువయ్యెను. రాజసూయము దుర్యోధనుఁ డింద్రప్రస్థమున కరుదెంచి సభను దర్శించి మనస్తాపమునకు గుఱియగుటకుఁ గారణమయ్యెను. ఆ మనస్తాపము జూదమునకుఁ గారణమయ్యెను. జూదము ద్రౌపదీ పరాభవమునకుఁ గారణమయ్యెను, అది ధృతరాష్ట్రుఁ డామెకు వరము లిచ్చుటకును పాండవు లామెమూలమున రాజ్యము సంపాదించుట కును గారణమయ్యెను. అది అపూర్వపణముతోఁ గూడిన అనుద్యూతమునకుఁ గారణమయ్యెను, అనుద్యూతము పాండవ వన గమనమునకుఁ గారణ మయ్యెను. ఇట్లిందలి కథా సన్నివేశము లన్నియు సభాసంబద్ధములై యుండు టచే నీ పర్వమునకు సభాపర్వమను పేరెంతయు నుచితమై యలరారు చున్నది.

మహాభారతమున సభాపర్వము మిక్కిలి ప్రధానమైనది. రామా యణమునందలి రామరావణ యుద్ధమునకు అరణ్యకాండమందలి సీతాప హరణ వృత్తాంతముపలెనే భారతమందలి కురుక్షేత్ర సంగ్రామమునకు సభా పర్వమందలి ద్రౌపదీ పరాభవ ద్యూతానుద్యూత వృత్తాంతములు ముఖ్య కారణములు. అందుచే భారతేతివృత్తమునకు సభాపర్వ వృత్తాంతము కేంద్రమని చెప్పవచ్చును, ఆదిపర్వ షష్ఠాశ్వాసమునందలి కుమారాస్త్రవిద్యా సందర్శన ఘట్టముననే భీమ దుర్యోధనుల గదాకౌశల ప్రదర్శనము "భావి పాండవ కౌరవ్య రణాభిసూచన పటిష్ఠంబయ్యె ఘోరాకృతి" నని నన్నయ భట్టు భారత సంగ్రామమును సూచ్యము కావించియుండెను. ఆ సూచన

సభాపర్వమున మఱింత స్పష్టతరముగా చేయంబడినది. నారదుఁడు పాండురాజు రాజసూయయాగము చేయవలెనని ధర్మజుని గోరిన వృత్తాంత మెఱింగించి "రాజసూయయాగ మొనరించి నీ పితరులను సురగణపూజ్యుల నొనరింపుము. మఱి రాజసూయము బహువిఘ్నము. బ్రహ్మరాక్షసులు దానరంధ్రంబ రోయుచుందురు. అదియును నిర్విఘ్నముగా సమాప్తమైనచో నఖిల ప్రజాప్రళయ కారణమైన రణమగు"నని హెచ్చరించి యుండెను. ధర్మజుఁడును నారద గమనానంతరము

> పితృగణ హితార్థముగ స, త్క్రతు వొనరింపంగ బుద్ధిగలదు ప్రజాసం
> హృతితత్క్రతువున నగునని, మతినాశంకయును గలదు మానుగనాకున్.

అని డోలాయమానమానసుండై ధౌమ్యాదులు ప్రోత్సహింప ననుజానుమతమున రాజసూయము చేయ సమకట్టెను. భీమాదుల పరాక్రమము కతమునను, శ్రీకృష్ణుని అనుగ్రహము కతముననను రాజసూయము నిర్విఘ్నముగా జరిగిపోయెను. ఇది నారదుఁడు చెప్పినట్లు నిఖిల ప్రజాప్రళయ కారణమైన రణము జరుగుటను సూచించుచున్నది. ఆ రణము కురుక్షేత్ర సంగ్రామమే.

శకుని ప్రేరితుఁడై దుర్యోధనుఁడు ద్యూతమునకు ధర్మరాజును రావింపుమని ధృతరాష్ట్రుని గోరినప్పు డాతఁడు జూదమున కొడఁబడనొల్లక "ఏను విదురు శాసనంబున వర్తిల్లుచున్నవాఁడ నాతం డర్థానర్థ విదుండు సకలకార్య సమర్థుండు జూదంబున విగ్రహంబగు ననియె. బలవంతులతోడి విగ్రహంబు పరిహరించుట ల"గ్గని బోధించెను. దుర్యోధనుఁడు పట్టుపట్టెను. ధృతరాష్ట్రుఁ డెట్టకేల కంగీకరించి ధర్మజుని గొనివచ్చుటకై విదురుని నియోగించెను. విదురుఁడు విషణ్ణహృదయుఁడయి మాయా దురోదరము దురర్థముగాఁ జింతించియు ధృతరాష్ట్ర విధాతృ నియోగమున కొడఁబడి యింద్రప్రస్థపురమునకు బయలుదేఱెను. విదురునివలన ద్యూతవృత్తాంతమువిని ధర్మజుఁడు "లాలితాపూర్వ సభాలోకనంబునయందు జూదంబు కార్యంబె చెపుమ జూదంబు కతమున భేదంబుగాకుండ నేరదు మాలోన" అని పలికియు విదురుని నియోగమలంఘ్య మగుటచే విధినియుక్తుఁడై హస్తినాపురమునకు విదురునితో నరిగెను. ఇచ్చటఁ గూడ విదుర ధర్మజుల మాటలయందు నన్నయ భవిష్యద్విగ్రహ విభేదములను లెస్సగా సూచించి యుండెను.

ప్రథమ ద్యూతానంతరము దుర్యోధనుఁడు వరవుళ్ళఁ గలసి తనయిల్లు తుడుచుటకు పంచు నుద్దేశముతో ద్రౌపదిని దోడ్కొనిరమ్మని విదురు నాదేశించెను. విదురుఁ డంత దుర్యోధనుని యధర్మారంభము విరసించి తుదిసారి "జూదంబున నెగ్గు వుట్టు. దీననయ్యెడు ఫలంబు వేణు ఫలంబునుంబోలె సహమూల వినాశనంబునకు నిమిత్త" మగునని హెచ్చరించెను. దుర్యోధనుఁడు వినక విదురుని నిందించుచు ద్రౌపదిని దోడ్కొనివచ్చుటకై ప్రాతికామిని బంపెను.

దుశ్శాసనుఁడు నిండుసభలో ద్రౌపది కట్టిన పుట్టములొల్చు సమయంబున భీముఁడు కోపమున నంతకాకారుఁడై "దుశ్శాసనున్ లోక భీకర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ నిర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నా స్వాదింతు నుగ్రాకృతి" (౨-233)నని శపథము కావించెను తరువాత దుర్యోధనుఁ డామెను దన కుఱువు నెక్కరమ్మని సన్నచేసినప్పు డాతఁడు లయసమయ సండధర నిర్దయుఁడై "ఇద్దురాత్ము దుర్వార మదీయబాహు పరివర్తిత చండ గదాభిఘాత భగ్నోరు తరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్" అని ప్రతినచేసి యాయుధములున్న వలనికి దృష్టులు సారించెను. ఈ రెండు శపథములందలి "అని, ఉగ్రరణాంతరము" అను పదములు భవిష్యన్మహా సంగ్రామమును సూచించుచున్నవి.

ధర్మరాజు వెంట భీమ పార్థ నకుల సహదేవు లరణ్యమున కరుగుచు సంభృతక్రోధులై పరుష భాషణములు పలికి యుండిరి. "దుర్యోధనాదులగు రిపుల జగద్ద్రోహులఁ జంపుదు నత్యుగ్రాహవమున" నని భీముఁడును, "చతుర్దశాబ్దమున మాత్రై పోరు కర్ణాది దుర్జనసంఘంబుల మార్తురం దునుముదున్ సంగ్రామరంగంబున" నని యర్జునుఁడును, "శకుని నస్మత్ప్రాయక జితహస్తుఁ జేసి చంపుదు మాజి" నని నకుల సహదేవులును బలికిన పలుకులలోఁగూడ యుద్ధ ప్రస్తావము కలదు. నిజమున కప్పటికి యుద్ధపుఁ జిన్నెలేమియు లేవు, అయినను వారు యుద్ధమున నిట్లు చేసెద మట్లుచేసెద మని పల్కుట ముందు జరుగఁబోవు యుద్ధమును సూచించుచున్నది. అరణ్యమున కేగుచుఁ ద్రౌపదీ పాండవులును ధౌమ్యుండును వహించిన యాకృతి విశేషములను జేష్టలను ధృతరాష్ట్రునకు విదురుఁడు వివరించు సందర్భమునఁగూడ భవిష్యత్సంగ్రామ సూచన కనఁబడుచున్నది.

నన్నయ యనువదించిన భారత ప్రతి : వ్యాసరచిత సంస్కృత భారతము ననుసరించియే నన్నయ తెనుఁగున భారతము రచించిన మాట నిజమే యైనను ఇప్పుడు లభించుచున్న యేదో యొక సంస్కృత భారత ప్రతితో నతని రచనను బోల్చి యతఁడు మూలమునకు వన్నె పెట్టెననియో లేక మూల సౌందర్యమునకు భంగము కలిగించె ననియో చెప్పుట యుక్తము కాదు. ఏలయన సంస్కృత భారతము వ్యాసుఁడు రచించినప్పు డుండిన రూపముతోడనే తరువాత లోకమునఁ బ్రచారము పొందియుండలేదు. అనేక కారణములచేఁ గాలక్రమమున నందనేక ప్రక్షేప విక్షేపములు ప్రవేశించినవి. అందుచే నన్నయ తెనుఁగుసేఁతనుగూర్చి యేదైనఁ జెప్ప నుంకించుటకు ముందాతఁ డనుసరించిన ప్రతి యెట్టిదో తెలిసికొనవలసిన యావశ్యక మెంతైన నున్నది.

సంస్కృత భారతము మొదట మౌఖికముగనే ప్రచారము నొందినను తరువాత పెక్కు లిపులలో లిఖితరూపమును బొందినది. ఆ లిఖిత ప్రతులను ఉత్తర వర్గము, దక్షిణ వర్గము అని ప్రధానముగా రెండు వర్గములుగా విభజింపవచ్చును. దక్షిణవర్గమునందలి ప్రతులలో తెలుఁగు, గ్రంథ, మలయాళ లిపులలో వ్రాయఁబడినవి ముఖ్యములైనవి. నన్నయభట్టు దక్షిణమున నాంధ్రదేశమందు రాజమహేంద్రవరములో నివసించి యుండుటచే దాక్షిణాత్య వర్గమున తెలుఁగు లిపిలో వ్రాయఁబడిన సంస్కృత భారతమును జదివియుండు ననుట సహజముగా నుండును. అతఁడు పర్వ సంగ్రహమున సభాపర్వమున నున్నవని చెప్పిన శ్లోకముల సంఖ్య దాక్షిణాత్య ప్రతులందలి సంఖ్యతోడనే కొంచె మించు మించుగా సరిపోవుచున్నది. కాని యతని సభా పర్వ రచనా క్రమమును బట్టిచూడ నతఁ డౌత్తరాహ ప్రతినే యనుసరించెనని తోఁపక మానదు. ఏలయన దాక్షిణాత్య ప్రతులలో మాత్రమే కానవచ్చునవియు, నుత్తర ప్రతులలో లేనివియు నగు నధిక పాఠములను గాని పునరుక్తులనుగాని యాతఁ డించుకయైన స్పృశించియుండలేదు. భీష్ముఁడు కృష్ణుని మాహాత్మ్యమును శిశుపాలుని కెఱింగించు సందర్భమునఁ గల యతి దీర్ఘమైన యధిక పాఠమునం దాధ్యాత్మిక విషయ మెక్కువగా నుండుటచే నాతఁడు దానిని విడిచివైచెనని చెప్పవచ్చును గాని మిగిలినవాని విషయమున నట్లు చెప్పుటకు వీలులేదు. అందుచే నాతఁడు సభాపర్వానువాద

సందర్భమున గ్రహించినది దాక్షిణాత్యపాఠము కాదని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. అగుచో నాతఁడు సభాపర్వమున 4311 శ్లోకము లుండెనని చెప్పనేల యను ప్రశ్న ముదయించును. దాక్షిణాత్యవర్గమునకుఁ జెందిన ప్రతులలోఁ దప్ప నుత్తర వర్గమునకుఁ జెందిన యే ప్రతిలోఁ గాని యన్ని శ్లోకములు గాన రావు. దీనిని బట్టి నన్నయపర్వ సంగ్రహమున 2311 శ్లోకములే కలవని వ్రాసినను దాక్షిణాత్యప్రతుల శ్లోక సంఖ్య నెఱిఁగిన వారెవ్వరో రెండును నాలుగుగా మార్చి క్రొత్త పాఠమును గల్పించి యుందురని తోఁచుచున్నది. లేని యెడల నన్నయ పర్వ సంగ్రహమున దాక్షిణాత్య ప్రతులందలి శ్లోక సంఖ్యను జెప్పి యనువాద మొనరించు నప్పు డుత్తరప్రతి ననుసరించెనని చెప్పవలసి వచ్చును.

నన్నయకు తెలుఁగు లిపియు దేవ నాగరీ లిపియు తెలిసియుండునని మన మూహింపవచ్చును. అతఁ డుత్తర ప్రతులను బరిశీలింపవలసి నప్పుడు దేవనాగరీప్రతులనే చూచియుండు ననుట యసమంజసముగా నుండదు. దేవ నాగరీ లిపిలో వ్రాయఁబడిన ప్రతులలో నతఁడు కాశ్మీర ప్రతి ననుసరించి వ్రాయఁబడిన ప్రతుల మాతృకనే యనుసరించి యుండునని చెప్పుట కాధారములున్నవి. అతని రచన పెక్కువిధముల భండార్కరు పరిశోధన సంస్థ వారు ప్రధానముగా గ్రహించిన శారదా ప్రతికిఁగూడ సన్నిహితముగానే యున్నది. శారదాప్రతి సంప్రదాయమును కాశ్మీరప్రతుల సంప్రదాయ మును అభిన్నములే.

నన్నయ ఉత్తర ప్రతులనే ప్రధానముగా ననుసరించినమాట సత్యమే యైనను దక్షిణప్రతుల నసలు చూచియుండకపోలేదు. దక్షిణ దేశములో నుండి యతఁడు దాక్షిణాత్య పాఠమును జూచియుండలేదనుట హాస్యాస్పద ముగా నుండును. దక్షిణ ప్రతులలో నధిక పాఠములును బునరుక్తులును హెచ్చుగా నుండుటచేతను, నుత్తరప్రతులందలి రచన సంక్షిప్తమయ్యు లోప రహితమై సక్రమముగా సాగిపోవుటచేతను అతఁడు దానినే ప్రధానముగా గ్రహించియుండును. అట్లుగాక యతఁడు దక్షిణప్రతినే యనుసరించెనని చెప్పినచో దాక్షిణాత్య ప్రతులలోఁ గానవచ్చు నధిక పాఠాదులన్నియు నాతని కాలమునకుఁ దరువాతఁ జేరినవని చెప్పవలసివచ్చును.

క్రీ. శ. 17వ శతాబ్దిలో నివసించిన నీలకంఠుఁడు భారతమునకు వ్యాఖ్యానము రచించుచుఁ బాఠ నిర్ణయ విషయమునఁ దాను బొందిన క్లేశము నచ్చటచ్చట సూచించి యున్నాఁడు. అతఁడెన్నో ప్రతులను, దనకుఁ బూర్వమున్న వ్యాఖ్యానములను బరిశీలించి పాఠ నిర్ణయము గావించు కొన్నట్లు

బహూన్ సమాహృత్య విభిన్నదేశ్యాన్-కోశాన్ వినిశ్చిత్యచపాఠమగ్ర్యం
ప్రాచీం గురూణా మనుసృత్య వాచ. మారభ్యతే భారత భావదీపః.

అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. అతఁ డుద్యోగపర్వమునందలి సనత్సుజాతీయమునకు వ్యాఖ్యానము రచించుచు "ఉద్యోగపర్వణి సనత్సుజాతీయే భాష్యకారాదిభి ర్వ్యాఖ్యాతాన్ సంప్రతితన పుస్తకేషు చ స్థితాన్ పాఠాంశ్చ గుణోపసంహార న్యాయే నైకీకృత్య వ్యాఖ్యాయతే" యని యాతఁడు చెప్పిన మాట యితర భాగముల విషయమునఁ గూడ నన్వయించును. దీనినిబట్టి యాతఁడు భారతమునందలి భాగములను బెంపుచేయుటకే యత్నించెనని స్పష్టమగును. సాధారణముగా భారతవిషయమునఁ బూర్వుల దృష్టి యంతయు నట్టిదే. వారు పీఠైన నప్పుడెల్ల లభ్యములైన యధిక పాఠముల నన్నిటిని జేర్చి తాము సంపాదించిన ప్రతిని పాఠక కామధేనువుగాఁ జేయుటకే యత్నించి యుండిరి. నన్నయయు తన నాఁటికి లభ్యములగుచున్న ముఖ్య పాఠముల నన్నిటిని జూచి తన పాఠమును దాను నిర్మించుకొనెనని కాని యన్నిటినుండియు విచక్షణతతో నుచితములైన భావములను భాగములను గ్రహించెనని కాని చెప్పవచ్చును. అతఁడేదో యొక ప్రతిని బ్రధానముగా గ్రహించి ప్రత్యంతర సాహాయ్యమున దానికిఁ గొన్ని చేర్పు మార్పులు చేసికొనియుండును. సభాపర్వ విషయమున నట్లాతఁడు సమకూర్చుకొన్న ప్రతి దాక్షిణాత్య ప్రతులకంటె నౌత్తరాహ ప్రతులకే సన్నిహిత తరమై యున్నది.

**నన్నయ యనువాద పద్ధతి :** ఆంధ్రభారతము సంస్కృత భారతమున కనువాదమని పలువురు చెప్పుచుందురు. కాని యది మక్కికి మక్కిగాఁ జేయఁబడిన సన్నిహితానువాదము మాత్రము కాదు. కవిత్రయమువారు మూలభారతమును లెస్సగాఁ బఠించి, యం దనవసరములని తోఁచిన భాగము

లను దగ్గించియు, నవసరములని తోఁచినచోట్ల వర్ణనాదులను బెంచియు, ననుచితములని తోఁచినచోట్ల నన్యథాకరించియు మూలగ్రంథము నందలి కథాక్రమమును సన్నివేశములను మాత్రము విడువక, వర్ణనాదులను రస పోషణమును దమ యిచ్చవచ్చిన ట్లొనరించుచు స్వతంత్రముగా రచన సాగించిరి. ఈ పద్ధతి నొక విధముగాఁ గథానువాద పద్ధతి యని చెప్ప వచ్చును. దీనికి మార్గదర్శకుఁడు నన్నయభట్టే. పదమునకుఁ బదముగాఁ గాని శ్లోకమునకుఁ బద్యముగాఁగాని భారతము ననువదింపవలెనను నభిప్రాయ మాతనికి లేదు. రాజరాజుకూడ నాతనిని "కృష్ణద్వైపాయనమునివృషభాభి హిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు" మని కోరెనేకాని భారతమును యథామూలముగా ననువదింపుమని కోరియుండ లేదు. నన్నయ్యయుఁ బ్రభుని యభీష్టము నెఱింగి తదనుగుణముగా వ్యాసుఁడు నిరూపించిన యర్థమునకు భంగము రాకుండ భారతాంధ్రీకరణము నకుఁ బూనుకొనెను. నన్నయ్యయేకాదు. తిక్కన యెఱ్ఱనలుకూడ వ్యాస భారతమునందలి యర్థమును వెల్లడించుటకే ప్రయత్నించియుండిరి. వారిది స్వతంత్రమైన యనువాదము. అనువాదమయ్యు స్వతంత్రతాగుణశోభితమై యుండుట వారి రచనయందలి వైశిష్ట్యము.

వ్యాసుని కాలమునకును నన్నయ కాలమునకును నడుమఁ బెక్కు వందల సంవత్సరములు గడచినవి. ఇట్లు కాలమునందే కాక వారు నివసిం చిన దేశమునందుఁ గూడ భేదమున్నది. దేశకాలభేదముచే సాంఘికాది సంప్రదాయములందును, ఆచార వ్యవహారములందును, ఆహార విహారము లందును వ్యత్యాస మేర్పడుచుండుట సహజము. ఈ వ్యత్యాసము ననుస రించి నన్నయాదులు తమ రచనలోఁ గొన్ని మార్పులు ప్రవేశపెట్టియుండిరి. ఇది వారి వివేకమునకును ఔచిత్య దృష్టికిని దార్కాణము. మఱియు భారత రచనమున వ్యాసుని దృష్టికిని కవిత్రయము వారి దృష్టికిని గొంత భేదమున్నది. వ్యాసునిది పౌరాణిక నైతిక దృష్టి. అతఁ డవకాశము లభించినప్పుడెల్ల భారతమున ధర్మ తత్త్వ నీతి విషయములను బ్రపంచించు చుండును. కవిత్రయము వారికిఁగూడ ధార్మిక నైతిక దృష్టి యున్నను దానికంటెఁ గావ్యదృష్టి యెక్కువ. ఆ కారణముచే వారు కథాగమనమున కాటంకము కలిగించు ధర్మనీతి తత్త్వ ప్రసంగములను సంగ్రహించుటయో

వర్జించుటయో కావించుచుందురు. దీనివలన వారికి వ్యాసమహర్షి యెడ గౌరవము లేదని భావింపరాదు. ఆ మహనీయుని యనుగ్రహమువలననే తాము కవులమైతి మని భావించి వారాతనిని గావ్యారంభముల భక్తిమైఁ బ్రస్తుతించి యుండిరి.

(అ) నన్నయ విడిచివేసిన భాగములు : భీష్ముఁడు శ్రీకృష్ణుని మహత్త్వమును శిశుపాలున కెఱింగించు సందర్భమున దక్షిణ ప్రతులలోఁగల 803 శ్లోకములతోఁ గూడిన భాగమును నన్నయ స్పృశింపక విడిచెనని యిది వఱకు చెప్పఁబడినది. తత్త్వ విషయమయ మగుటచేతను, అతి దీర్ఘమగుట చేతను ప్రధానకథ కాటంకముగా నుండునని యాతఁడు దానిని విడిచి వైచెనో తాను జూచిన ప్రతిలో నది లేకపోవుటచే విడిచివైచెనో చెప్పఁ జాలము. ఉత్తర దక్షిణ ప్రతులు రెండింట నుండియు నన్నయచే విడువఁ బడినవి మాత్రమే యిట సూచింపఁబడును.

i. నారదుఁడు బ్రహ్మ సభను వర్ణించుచు "దేవో నారాయణస్తస్యాం తథా దేవర్షయశ్చ యే" (11 - 32) అని నారాయణుఁడు కూడ నందుండెనని చెప్పినట్లు మూలమందున్నది. ఇది యుచితము కాక పోవుటచే నన్నయ విడిచివైచెను.

ii. మూలమున 14, 15 అధ్యాయముల యారంభమున ధర్మరాజు

శమమేవ వరం మన్యే నతు మోక్షా ద్భవే చ్ఛమః
ఆరంభే పారమేష్ఠ్యం తు నప్రాప్య మితి మే మనః (14-5)

సన్న్యాసం రోచయే సాధు కార్యస్యాస్య జనార్దన
ప్రతిహంతి మనో మేఽద్య రాజసూయో దురాసదః (15-5)

అని తనకు రాజసూయయాగ మొనరించుటకు సామర్థ్యము కాని అభిలాష కాని లేదని చెప్పినట్లు గలదు. తెలుఁగున నతఁడు రాజ సూయయాగమునఁ బ్రజాసంహృతి యగునని విచారించెనే కాని తన కట్టి శక్తి లేదని తలంచియుండలేదు. అది దురాసదమను నభిప్రాయమే నిజముగా నతని కుండినచోఁ నాతఁడు దానిని జేయకయే యుండును.

iii. సహదేవుఁడు జయించిన రాజుల పట్టికలో మూలమున సంధ్రులు కూడఁ బేర్కొనఁబడి యున్నారు. నన్నయ యంధ్రులను విడిచి పెట్టెను. ఇందు శాతనికిఁగల యాంధ్రాభిమానము కారణమని చెప్ప వచ్చును.

iv. భూలింగ పక్షి 'మాసాహస' మని యెల్లప్పుడును బలుకుచుఁ దాను మాత్రము సాహసమాచరించుచుండుననియు, సింహదంతాంతర్గతమైన మాంసార్గలమును దిని జీవించుచుండుననియుఁ జెప్పుదురు. మూలమున రెండుచోట్ల శిశుపాలుఁడు భీష్ముని నాభూలింగ పక్షితోఁ బోల్చుటయే కాక "యుక్తమేతత్తృతీయాయాం ప్రకృతౌ వర్తతా త్వయా" యనియు నధిక్షేపించి యుండెను. అసభ్యములని తోఁచుటచే నన్నయ యుపమానమును అధిక్షేపమును విడిచివైచెను.

v. మూలమున దుర్యోధనుఁడు పాండవ సభా వైభవమును జూచి యీర్ష్యవహించినప్పుడు శకుని "వత్సా! ధర్మజునిగూర్చి నీ వీసు వహించుట తగదు. పాండవులు పైతృకమైన యంశమును బొంది స్వతేజముచే నభివృద్ధి నొందించినారు. నీవు శోకింపనేల? నీవును సోదరులయు ద్రోణాదులయు సాయమున సర్వవసుంధరను జయింపు" మని నీతి సహితమైన యుపదేశము కావించినట్లున్నది. అట్టి నీతి శకుని సహజ ప్రకృతికి విరుద్ధ మగుటచే నన్నయ దానిని విడిచి "జూదమునకు ధృతరాష్ట్రునను జ్ఞానము వడయుము దానివలన మన కఖిలైశ్వర్యములు కలుగు"నని యాతఁడు చెప్పినట్లు రచించెను.

vi మూలమున దుర్యోధనుఁడు తన మనస్తాపమును దండ్రికెఱింగించుట (46-49) నాలుగధ్యాయములలో వివరింపఁబడినది. అందుఁ బాండవులకు రాజులు తెచ్చియిచ్చిన కానుకల వివరములు పునరుక్తులు చాలఁ గలవు నన్నయ యందలి పునరుక్తులను అనావశ్యక విషయములను దొలఁగించి దుర్యోధనుని మానసికావేదనను మాత్రము చక్కగా వెల్లడించెను.

vii. ద్యూతమున ధర్మజుఁ డోడిపోవుచుండ విదురుఁడు ధృతరాష్ట్రునితో "త్యజేత్కులార్థే పురుష" మిత్యాదిగాఁగల శుక్రనీతిని జెప్పి పిమ్మట

సువర్ణష్ఠీవులగు పక్షుల వృత్తాంతము వివరించెను. (152-11-14) ఆ వృత్తాంతమున నొక రాజు ధనాశచే సువర్ణష్ఠీవులను జంపినట్లున్నది. ఈ యుపమానమున ధృతరాష్ట్రునికిఁ బాండవులను జంపు నుద్దేశ మున్నట్లు ధ్వనించుచుండుటచే నన్నయ దానిని విడిచివైచెను పై సంవర్గము ననే మూలమున దుర్యోధనుఁడు విదురుని "మార్జారవత్పోషకం చోపహంసి" "సుసాన్త్వితాపి హ్యసతీ స్త్రీ జహాతి" మున్నగు వాక్యములచే నిందించెను. దుర్యోధనునివంటివాఁడు కూడ ధర్మమూర్తియైన విదురునట్లు దూషించుట సభ్యతాదూరముగా నుండుటచే నన్నయ యా వాక్యములను విడిచివైచెను.

viii. పాండవు లడవి కరుగుచుండ దుశ్శాసనుఁడు వారిని దూలనాడుచు ద్రౌపదిని దమలో నెవ్వరినైన భర్తగాఁ గోరుకొమ్మని హెచ్చరించినట్లును, భీముఁడంతఁ గుపితుఁడై పరుషోక్తు లాడినట్లును, దుశ్శాసనుఁ డపుడు "గౌర్గౌః" అని యధిక్షేపించుచు నాతని చుట్టు నాట్యము చేయ మొదలిడినట్లును, దుర్యోధనుఁడు గూడ భీముని గమనమును స్వగతిచే ననుకరింప మొదలిడినట్లును మూలమునందున్నది. ఆ వర్తనము దుర్యోధన దుశ్శాసనుల గరువతనమునకుఁ దగినట్లు లేక బాలోచితముగా నుండుటచే నన్నయ విడిచివైచెను.

ix. పాండవ వన గమనానంతరము దుర్యోధనాదులు ద్రోణునే తమ కాశ్రయముగా భావించి రాజ్యమునంతను ఆతనికి నివేదించినట్లును ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని వలనఁ దనకు మరణము గలుగుటను దెల్పి యజ్ఞాదు లొనరింపుఁడని వారి కుపదేశించినట్లును మూలమునఁ గల విషయమును (71) దుర్యోధనాదులకు ద్రోణునెడ నంత విశ్వాసము లేకుండెనని యెంచుటచేఁ గాఁబోలు నన్నయ విడిచివైచెను.

(ఆ) నన్నయ సంక్షేపించిన భాగములు ; సంస్కృత భారతముతోఁ బోల్చి చూచినచో తెలుఁగు భారతము సగమునకుఁ బైగాఁ దగ్గింపఁబడినట్లు తోఁచును. మూలమునందలి వర్ణనలను, సంభాషణలను, ప్రశ్నోత్తరములను నన్నయ చాలవఱకు సంక్షేపించుటయే యిందుకుఁ గారణమ్ము.

i. మూలమునందలి 2వ అధ్యాయమున మయుఁ డుండఁగనే కృష్ణుఁడు ధర్మరాజాదులను వీడ్కొని ద్వారక కరిగెనని చెప్పఁబడినది. నన్నయ యీ యధ్యాయమునంతను "అంతనారాయణుండును పాండవులను వీడ్కొని పితృదర్శన లాలసుండై ద్వారవతీపురంబున కరిగె" నని యొక్క వాక్యమున సంగ్రహించెను రాజసూయయాగానంతరము కృష్ణుఁడు పాండవులను వీడ్కొని యేగు వృత్తాంతము మరల వచ్చును. అది ముఖ్యమగుటచే నచ్చట పాండవులు కృష్ణుని సాగ నంపుటను నన్నయ రెండు మూఁడు పద్యములలో వర్ణించెను.

ii. 4వ అధ్యాయమున 18వ శ్లోకమునుండి 27వ శ్లోకము వఱకు నే యే రాజులు వచ్చి ధర్మజుని సేవించిరో తెల్పఁబడినది. దాని నంతను నన్నయ " అయ్యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతు " (౧-18) లని చక్కగా సంగ్రహించెను. ఇట్లనుటలో ధర్మజుని గొల్చుటకు వచ్చిన రాజుల అపరిమితత్వముకూడ వెల్లడియగుచున్నది.

iii. మూలమున నారదుఁడు ధర్మజు నడిగిన ప్రశ్నలు సుమారు వంద శ్లోకముల నాక్రమించియున్నవి. నన్నయ యందలి పెక్కు శ్లోకము లను విడిచివైచెను. కొన్నిటిని పెంచెను. కొన్ని పద్యములను స్వయ ముగా కల్పించెను. నారదుఁడు కావించిన సభావర్ణనలు విని ధర్మ రాజు వానినన్నిటిని మరల సింహావలోకనము కావించి హరిశ్చంద్రుని మహిమాతిశయములను గూర్చి యడిగినట్లు మూలమున నున్నది. నన్నయ యా సింహావలోకనమును వర్గించివైచెను

iv. రాజసూయయాగాచరణమున ధర్మజున కుత్సాహము కలిగించుచు నర్జునుఁడు పరాక్రమ గుణమును విస్తృతముగా వర్ణించినట్లు మూల మునన్నది. (15-11-16) నన్నయ ఈ క్రింది పద్య మొక్కటి మాత్రము వ్రాసెను.

> కులరూపగుణ ద్రవ్యంబులు విక్రమవంతునందు భూ విదితములై
> నిలుచు నవిక్రమునకు నవి, గలిగియు లేని క్రియ న ప్రకాశంబు
> లగున్ (౧-128)

v. 54 వ అధ్యాయమున ధర్మరాజొక్కొక్క వస్తువునే యొడ్డి దానిని వర్ణించి "తేన దీవ్యామ్యహం త్వయా" అనుచుండుటయు శకుని జయించితినని "జితమిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత" అని పల్కుచుండుటయుఁ బెక్కుసార్లు కాననగును. నన్నయ ధర్మజుఁ డొడ్డిన వస్తువుల నన్నిటిని (177 వ) వచనమున సంగ్రహముగా వర్ణించి "ఒక్కొక్క యొడ్డునన యొడ్డి యోటువడె" నని మూలమునందలి పునరుక్తిని దగ్గించెను.

vi జూదమున ధర్మరా జొక్కొక్క యొడ్డునే యోడుచుండుట గాంచి విదురుఁడు దుర్యోధనుని బహిష్కరించి కౌరవవంశమును గాపాడుమని ధృతరాష్ట్రుని ప్రబోధించెను. పిమ్మట 56 వ అధ్యాయమున నాతఁడు శకుని నాతని రాజ్యమునకుఁ బంపివేయుమని చెప్పి నట్లు మూలమం దున్నది. నన్నయ యీ యధ్యాయమునంత "ఇంకనైన నుపేక్షింపక యీ దుష్టద్యూతము వారింపు"మను వాక్యముతో సంగ్రహించెను. తరువాత విదురుఁడు దుర్యోధనునికూడ మందలింప నతఁడు కుపితుఁడై "మార్జారవత్పోషకం చోపహంసి" ఇత్యాదిగా విదురు ననేకవిధముల దూషించెనని మూలమున నున్నది. నన్నయ యా దూషణమునంత నొక సీసమున సంగ్రహించెను.

vii సభవారు పాంచాలీ ప్రశ్నమును విచారింపవలెనని హెచ్చరించు సందర్భమున విదురుఁడు సభాధర్మములను విస్తరించి చెప్పినట్లు మూలమం దున్నది. నన్నయ ఆ విషయము నొక్క పద్యములో సంగ్రహించి చెప్పెను.

ఈ విధముగా నన్నయ పెక్కుచోట్ల మూలభాగములను సంగ్రహించెను. పుర, నదీ, యుద్ధ, రాజగుణ, రాజ్యపాలనములును, ధర్మతత్త్వ నీతివిషయ కోపన్యాసములును, వ్యక్తి వస్తు నామముల పట్టికలును అతఁడు సంక్షేపించిన యంశములలో ముఖ్యములైనవి. మూలమున నధ్యాయము మాఱినప్పుడెల్ల జనమేజయుఁ డేదో ప్రశ్నించుచుండుటయు వైశంపాయనుఁడా ప్రశ్నలకు సమాధానము చెప్పుచుండుటయు గానవచ్చును నన్నయ పెక్కు చోట్ల నా ప్రశ్నలను దొలఁగించి తానే కథను సక్రమముగా

సాగించెను. నన్నయ కావించిన యీ సంగ్రహీకరణములవలనఁ బ్రధాన కథా గమనమున కంతరాయము కలుగకపోవుటయే కాక యప్రసక్త విషయ వివరణము తగ్గుటచే దానికిఁ బ్రసన్నత యేర్పడినదని చెప్పవచ్చును.

(ఇ) **నన్నయ మూలమును పెంచి వ్రాసిన భాగములు :** అచ్చటచ్చట నన్నయ మూలమునకుఁ బెంపుగలిగించిన పట్లు కూడఁ గొన్ని గలవు. ఈ పెంపు మూలమున లేని వర్ణనములను. భావములను జొప్పించుట, మూలస్థమైన పదమునో, పదసమూహమునో గ్రహించి యందలిభావమును విపులీకరించుట, అలంకారములను బ్రవేశపెట్టుట. వ్యక్తిగుణశీల ప్రదర్శనమునకై విశేషణములను వాడుట మున్నగు రూపముల గానవచ్చును.

i. కృష్ణుఁడు భీమార్జునులతో మగధదేశమును జేరినపిమ్మట నన్నయ గిరివ్రజపురమును "ఉరుతర హర్మ్యమాలికల" ౧-172 అను పద్యమునఁ జక్కగా వర్ణించెను. మూలమున వనపర్వత వర్ణనమే కాని పురవర్ణనము కానరాదు. జరాసంధ వధానంతరము కృష్ణుఁడు భీమార్జునులతో నింద్రప్రస్థమున కరుదెంచినప్పుడు ప్రజలు పొందిన సంతోషమును నన్నయ మూఁడు పద్యములతో వెల్లడించెను. మూలమునఁ బ్రజల ప్రసక్తియే లేదు.

ii తమ్ములు నాలుగుదిక్కులను జయించి వచ్చినపిమ్మట ధర్మరాజు "యజ్ఞాయైవ మనో దధే" యని యజ్ఞముచేయ నిశ్చయించినట్లుమాత్రము మూలముననున్నది. నన్నయ యిచ్చట మంత్రుల ముఖమున వైభవ సమృద్ధి (౧-272) నొక వచనమున మనోహరముగా వర్ణించెను,

iii. నారదుఁడు ధర్మజునకు హరిశ్చంద్రుని మహిమాతిశయమును వర్ణించుచుఁ జెప్పిన పద్యమును (౧-౯౭) ఇంద్రసభావర్ణన సందర్భమునందలి "వదలక యేలిన వాని ప్రస్తవమునఁ బోరిలో నీల్గిన వీరభటు" లిత్యాది సీసమును, శిశుపాలుఁడు కృష్ణు నాక్షేపించు సందర్భమునందలి "అతనికిఁ గూర్తురేని"(౨-19) అను పద్యమును అమూలకములైనట్టివే.

iv భీముఁడు కృష్ణుని యర్ఘ్యగ్రహణార్హతను సమర్థించుచు

వృద్ధు లోకలఘు యున్నను,బుద్ధియె యెవ్వరికి వారిఁబూజింపంగా
నిద్ధరణీశులలోగుణ,వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్
పూజితుల తృప్తులగుదురు, భూజను లోరుఁలచ్యుతుండు పూజితుఁ
డగుడున్
దేజమున జగత్త్రితయము, పూజితమయి తృప్తిఁబొందుఁ బుణ్య
సమృద్ధిన్ ౨-27, 28

అనిచెప్పిన పద్యములలోని కారణములు నన్నయ కల్పించినవే. రెండవ పద్యమందలి భావము కృష్ణుని జగత్త్రిత యాత్మకత్వమును సూచించుచు మిక్కిలి గంభీరముగా నున్నది.

v వరుణుని గొల్చు నదులను బేర్కొను సందర్భమున మూలములో "ఏతాశ్చాన్యాశ్చ సరిత స్తీర్థానిచ సరాంసిచ" యని యున్నది.అన్యాశ్చ అనుదానిలో నాంధ్రదేశమందలి పెన్ననుగూడఁ జేర్చి నన్నయ తన యాంధ్రాభిమానమును వెల్లడించెను

vi జర పుత్త్రశకలములను రెండిటిని గూర్చి బృహద్రథుని కర్పించినప్పు డాతఁ డామెను "కాత్వం కమల గర్భాభే మమ పుత్త్ర ప్రదాయినీ, కామయా బ్రూహి కల్యాణి దేవతాప్రతిభాసి మే" అని యడిగి నట్లున్నది. నన్నయ దానిని బెంచి

ఇచ్చకు వచ్చు పూజనల నెంతయు సంతసమొంది తొల్లి నా
కిచ్చె మునీశ్వరుండు దయ నిత్తనయున్ మఱియిప్డు నెమ్మితో
నిచ్చితి వీవు రాక్షసివె యిక్కల మెల్లను నుద్ధరింపఁగా
వచ్చిన పుణ్యదేవతవు వారిరుహాయతచారులోచనా! ౧-'52

అను చక్కని పద్యమును రచించెను.

vii శిశుపాలుఁడు కోపమున సపుత్త్రబలుఁడై సభవీడి యరుగునప్పుడు ధర్మజుఁ డాతని వెంటఁజని యనునయించుచు "వేన కృష్ణం హి తత్త్వేన భీష్మశ్చేదిపతే: భృశమ్" (౩౫-౫) అని చెప్పినట్లు మూలమందున్నది. నన్నయ కృష్ణతత్త్వమును వివరించుచుఁ గ్రింది పద్యమును వ్రాసెను.

ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు, వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు, లో
కాది, త్రిలోకపూజ్యుఁడని యాత్తనెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తమ కాకిది యేమిదోసమే?
(౨-18)

viii సునీథుఁడు క్షత్త్రియుల నెల్లఁ జేర్చుకొని యుద్ధసన్నద్ధుఁడైన సంద
ర్భమున మూలమున "తతః సాగర సంకాశం దృష్ట్వాన్నృపతి సాగరం,
రోషాత్ప్రచలితం సర్వ మిద మాహ యుధిష్ఠిరః" (57-1) అని
యున్నది. నన్నయ యప్పుడు జరిగిన సంక్షోభమును "రయవిచల
త్తురంగమ తరంగములన్" (౨-౩౩) అను పద్యమున నాలంకారిక
ముగా వర్ణించెను.

ix నారదుఁ డింద్రసభను వర్ణించుచు

తత్రైవాప్సరసో రాజన్ గంధర్వాశ్చ మనోరమాః
నృత్యవాదిత్ర గీతైశ్చ హాస్యైశ్చ వివిధైరపి
రమయన్తి స్మనృపతే! దేవరాజ శతక్రతుమ్ (7-21)

అని గంధర్వులును నప్సరసలును నృత్యవాదిత్రగీతములచేతను వివిధ
హాస్యములచేతను దేవేంద్రుని రంజింతురని చెప్పియుండెను. నన్నయ
యిచ్చట

అతుల విభూతితో మణిమయాభరణద్యుతు లొప్పఁగా శత
క్రతుఁడు శచీసమేతుఁడయి కాంచనచారు విమానమాలికా
గత దివిజోత్తముల్ గొలువఁగాఁ గొలువుండు వరాప్సరోంగనా
యత విలస త్కటాక్షకుసుమార్చిత సుందరవక్త్రచంద్రుఁడై ౧-63

అని రూపకాలంకారమును గూర్చి భావమునకు వన్నె పెట్టెను.

x పాండవులు ద్యూతార్థమై ద్రౌపదితోఁ గూడ హస్తినాపురమున
కరిగినపుడు "యాజ్ఞసేన్యాః పరామృద్ధిం దృష్ట్వా ప్రజ్వలితామివ,
స్నుషాస్తా ధృతరాష్ట్రస్య నా తిప్రమనసోఽభవన్" 52-32 అని ధృత

రాష్ట్రుని కోడండ్రు ద్రోవది వృద్ధినిజూచి దుఃఖించిరని మూలమున నున్నది. ఇందలి "పరావృద్ధి" మను మాటలను నన్నయ క్రింది పద్యమున నాలంకారికముగాఁ బెంచి ద్రౌపదీ సౌందర్యముయొక్క పరాకాష్ఠను బ్రదర్శించెను.

అఖిలలావణ్య పుంజంబు నబ్జభవుఁడు, మెలఁతగా దీనియందు
నిర్మించె నొక్కొ
కాని నాఁడిట్టి కాంతి యేకాంతలందు, నేలలేదని సామర్ష హృదయ
లైరి. ౨-160

xi "ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః సవ్యమూరు మదర్శయత్" 63-12 అను మూలమందలి వాక్యము ననువదించుచు నన్నయ "అమ్ముదితన్ విభీత హరిణాక్షిఁ గలాపవిభాసి కేశ భారమ్మున నొప్పుదాని" అని యమూలకములైన విశేషణములను గల్పించి వ్రాసెను.

(ఈ.) నన్నయ క్రమమునం దాసక్తికలవాఁడు. అన్నదమ్ములయు దిక్పాలాదులయుఁ బేర్లు చెప్పు సందర్భమునను ఇతర సందర్భములందును మూలమున క్రమము విడిచివేయఁబడుచుండును. నన్నయ యట్టి చోట్లఁ దప్పక క్రమమును బాటించుచుండును. మూలమున విదురుఁడు ధృతరాష్ట్రునకు పాండవు లరణ్యమున కేగిన విధము తెల్పిన పిమ్మట దుశ్శకునము లుప్పతిల్లెనని తెల్పినట్లున్నది. నన్నయ వానిని పాండవులు గజపురమును విడిచి యరుగు నప్పుడే వర్ణించెను (2-299). ఈ క్రమమే యుచితతరముగా నున్నది.

(ఉ.) **అన్యథాకరణములు :** కొన్ని కథాంశములను భావములను నన్నయ తన కుచితమని తోఁచిన విధముగా మార్చి వ్రాసెను.

i మయుఁడు తన ప్రాణములు రక్షించిన యర్జునున కేదైనఁ బ్రత్యుపకారము చేయఁదలంచి "మీకిష్టమైన దానిని నిర్మింతును. పనుపుఁ"డని మొదట నర్జును నడిగి యాతని ప్రేరణచేఁ దరువాతఁ గృష్ణునిగూడ నడిగియుండెను. కృష్ణుఁడు ముహూర్తకాల మాలోచించి (ముహూర్తమివ సంధ్యా) ధర్మజునకు సభ నిర్మింపుమని యాదేశించినట్లు మూలమున నున్నది. నన్నయ "కృష్ణుఁడు పెద్దయుం బ్రొద్దు విచా

రించి మయుని కిట్లనియె"నని వ్రాసియుండెను. ఇచ్చటఁ గృష్ణుఁడు చెప్పునది అసామాన్యమగు విషయమగుటచే నాతఁ డెక్కువసే పాలోచించె ననుటయే యుక్తముగా నున్నది.

ii సహదేవుఁడు దక్షిణ దిగ్విజయము చేసిన సందర్భమున మాహిష్మతీ పురమున నగ్ని పారదారికుఁడయి దండితుఁడైన వృత్తాంతము చెప్పఁబడినది. అగ్నిమాహిష్మతీ పురమున బ్రాహ్మణరూపముతో సంచరించుటకుఁ గారణమేమో మూలమునఁగానరాదు. అచ్చటిసందర్భమును జూచిన నందుకాతని పారదారికత్వమే కారణమని తోఁచును. నన్నయ "జాతవేదుండు విప్రుండయి వేదాధ్యయనంబు చేయుచు మాహిష్మతీ పురముననుండి ప్రమాదవశంబునం బారదారికుం డయ్యె"నని యాతఁడు వేదాధ్యయనాసక్తిచే మాహిష్మతి కరిగి యుండెననియుఁ బ్రమాదవశమునఁ బారదారికుం డయ్యెననియు సూచించెను. ఇది యా కాలమున నగ్నియంతవానికిఁ గూడ వేదము గఱపఁ జాలు మహా పండితులు మాహిష్మతీనగరమున నుండిరనియు, ధీమంతులకుఁ గూడ నొక్కొక్కప్పుడు ప్రమాదము సహజమనియు సూచించుచున్నది. మూలమున నా పట్టణమందలి స్త్రీలు స్వైరిణులై యుండ వచ్చునని యగ్నియే వరమిచ్చినట్లున్నది. నన్నయ యగ్ని తత్పుర నృపతి కాతఁడు కోరిన వరమిచ్చి "ఇప్పురంబు నింతు లెంతయు మనోజ రాగిణులు కావున వీరల స్వైరిణీవృత్తి యెల్లకాలము సహింపవలె"నని యడిగెననియు నాఁటంగోలె మాహిష్మతీపుర స్త్రీలకు స్వైరిణీత్వంబు నిర్దోష మయ్యెననియుఁ గల్పించెను.

ii. ద్యూతారంభమునకు ముందు మూలమున శకునియే ధర్మజునితో జూద మారంభించుటకు సమయమైనదని చెప్పినట్లున్నది. నన్నయ దుర్యోధనుఁడు ధర్మజుని ద్యూతార్థమై యాహ్వానించినట్లు వ్రాసెను.

iii. బృహద్రథుని భార్యలు తమకు శరీర శకలము లుదయింపఁగనే యుద్విగ్నలై వానిని విడిచివైచిరని మూలమునం దున్నది. నన్నయ కేవల భయమునే కాక వారి లజ్జనుగూడ వర్ణించుట యెక్కువ యౌచిత్యవంతముగా నున్నది.

iv. గిరివ్రజము చుట్టును గల యైదు పర్వతములును "రక్షంతీవాభిసంహత్య సంహతాంగా గిరివ్రజమ్" 19-3 అని సంహతాంగములై గిరివ్రజమును రక్షించుచున్నట్లున్నవని మూలమందుండ నన్నయ యవి "శూరభటులు వోలెఁ గాచి చుట్టును నుండు" నని చెప్పి వానిని శూరభటులతోఁ బోల్చుట రమణీయముగా నున్నది.

v. భీమ జరాసంధులు పోరు సందర్భమున మూలమందు జరాసంధుఁడు బలిరాక్షసుఁడు శక్రునివలె భీముని దాఁకె నని చెప్పఁబడియున్నది. బలియే యింద్రు నోడించిన కారణమున నీ యుపమాన ముచితముగా లేదని నన్నయ మార్చి "సింహ గజేంద్రములట్లు, వజ్ర పర్వతముల యట్లు, ఘోరతరవాసవవృత్రుల యట్లు" నిద్దఱును బోరిరని వ్రాసి యుండెను.

i. ద్యూతమునకు ధర్మజుని గొనివచ్చుటకై యరిగిన విదురుఁ డాతనికిఁ గుశల ప్రశ్నానంతరము ధృతరాష్ట్రుఁడు చెప్పిన పలుకు లన్నియు మరలఁ జెప్పినట్లు మూలమునం దున్నది. విదురునకు ద్యూత మభిమతము కాకపోవుటచే నన్నయ యా వివరములన్నియు విడిచి "కుశలం బడిగి నిజాగమన ప్రయోజనం బెఱింగించె" నని యా విషయము నంతను వ్యంగ్యముగా సూచించి విడిచిపెట్టెను.

(ఊ) మూలమున నచ్చటచ్చటఁ జెదరియుండు వ్యక్తుల గుణ గణములను నన్నయ వారిని బ్రవేశపెట్టునప్పుడు ముందే తెలుపుచుండును. ఈ పద్ధతి వలన వారి స్వరూప స్వభావములను గూర్చి పాఠకుల కొక యభిప్రాయము ముందే కలుగుట కవకాశము కల్గును. కృష్ణుఁడు ధర్మజునకు జరాసంధుని విషయమును జెప్పు సందర్భమున హంసడిభకు లాతనికి దక్షిణ వామ భుజములై వర్తిల్లుదురని తెల్పుచు వా "రనిర్జేయులు పరస్పర స్నేహాయత్తచిత్తు లతని యాప్తు"లని వారి ప్రధాన గుణము వర్ణించెను. తరువాత వారు మరణించుటకా పరస్పర స్నేహాయత్తచిత్తతయే కారణమైనది.

(ఋ) నన్నయ తాను రచించిన భారతభాగము నం దాయా సందర్భములలో ననేక సూక్తులను జొప్పించియుండెను. వీనిలోఁ బెక్కు మూలకము

లైనట్టిసే. సాధారణముగా నిట్టివాని నతఁ డర్థ భావములందు స్వయం సంపూర్ణములైన ప్రత్యేక పద్యములుగా వ్రాయుచుండును. వానిని సందర్భానుగుణముగా మన మెచ్చటనైన వాడుకొనవచ్చును. (౧-93 ; ౨-202)

**(ఋ) యథా తథానువాదములు :** నన్నయ మూల శ్లోకములను యథా తథముగా ననువదించిన పట్లును గొన్ని గలవు.

i. అగ్నిహోత్రఫలా వేదా దత్తభుక్త ఫలం ధనం
రతి పుత్త్రి ఫలా దారాః శీలవృత్తఫలం శ్రుతమ్ 5-101

దారసంగ్రహంబు ధరణీశ! రతిపుత్త్రి, ఫలము శీలవృత్తఫలము శ్రుతము
దత్త భుక్త ఫలము ధనము వేదము లగ్ని, హోత్రఫలము లనియునొగి
తెలుంగు ౧-51

ii. తావుభౌ సహితౌ వీరౌ జరాసంధశ్చ వీర్యవాన్
త్రయస్త్రయాణాం లోకానాం పర్యాప్తా ఇతి మే మతిః 13-37

భూమీశ ! హంసడిభకులు, నా మగధాధీశ్వరుండు న మ్మువ్వురును
ద్దామ భుజవీర్య సంపద,తో మూఁడు జగములు నోపుదురు సాధింపన్
౧-114

iii. అల్పోపిహ్యారి రత్యన్తం వర్ధమాన పరాక్రమః
వల్మీకోమూలజ ఇవ గ్రసతే వృక్ష మంతికాత్ 50-24

అల్పుఁడయ్యు మనుజుఁ డతి పరాక్రమమునఁ, బేర్మి తరతరంబు
పెరుఁగుచున్న
వాఁడు మ్రానిమొదలి వల్మీకమా మ్రానిఁ, జెఱుచు
నట్లు నడఁగి చెఱుచుఁబగఱ ౧-44

(ౠ) సభాపర్వమునందుఁ గల వృత్తాంతములలో శిశుపాలవధ వృత్తాంతము చాల ముఖ్యమైనది. సంస్కృతమున మాఘమహాకవి శిశుపాలవధ మహాకావ్యమును రచించెను. నన్నయ దానిని దప్పక చదివియుండును. అతని రచనలో నొంకు రెండుచోట్ల మాఘ కావ్యానుసరణము కూడ గోచరించును. మాఘకావ్యము నారదుఁడు శ్రీకృష్ణుని కడ కరుగుటతో నారం

ళించును. ఆ సందర్భమునందు "పతత్పతంగ ప్రతిమ స్తపోనిధిః" అని నారదునకు విశేషణ మొకటి వాడఁబడినది. ఈ భావము సంస్కృత భారతమున లేదు, నన్నయ మాఘకావ్యభాగము ననుసరించిరమే 'నీరజమిత్రుఁడేల ధరణీగతుఁడయ్యెడు నొక్కొ యంచు విస్మేరమనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి చూచుచుండఁగా' నారదుఁ డేగుదెంచెనని వర్ణించియుండెను.

సంస్కృతకావ్యభాగములను వలెఁ గన్నడమందలి పంపభారతములోని భాగములను గూడ నన్నయ యనుసరించినపట్లు కొన్ని కలవు. ఈ క్రింది పద్యములు నన్నయపై పంపభాగవతమునకుఁ గల ప్రభావమును సూచించుచున్నవి.

"సకలక్ష్మాచర ఖేచరాంచిత మహామాణిక్య గాణిక్య హ స్తి"
పం. ఆది. 8-136

మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపదలు
స. ౧-13

కురువృద్ధం కులవృద్ధ.. పంప. 6-44
కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ స. ౨-233

ఈ విధముగా నన్నయ సంస్కృత భారతమునందలి కథనే యనుసరించినను దనకుఁ బూర్వముండిన సంస్కృత కర్ణాట కావ్యములనుండి కూడఁ గొన్ని భావములు గ్రహించియు, సందర్భోచితముగా నూత్నకల్పనలు : వించియు, ననుచితములని తోఁచిన యంశములను బరిహరించియుఁ, గొన్ని వర్ణనలు పెంచియుఁ, గొన్ని తగ్గించియు నాంధ్రభారతమును సర్వాంగ సుందరముగా వెలయించెను. అందుచేతనే యది యనువాదప్రాయమయ్యు స్వతంత్ర గ్రంథమువలెనే శోభిల్లుచు నన్నయ ప్రతిభా విశేషమును వేయి విధముల వెల్లడి చేయుచున్నది.

**వస్తుసంవిధానము, కథాకథనము:-** అగ్నిభయమునుండి రక్షితుఁడైన మయుఁ డపూర్వమైన సభను నిర్మించియిచ్చుట ఆది సభాపర్వములకును జూదమున నోడిన పాండవులు వనమున కరుగుట సభారణ్య పర్వములకును

గల సంబంధమును జక్కగా వ్యక్తము చేయుచున్నవి. సభాస్థితుఁడైన తన్నుఁ జూచుట కరుదెంచిన మునులు నర్హరీతిఁ బూజించి వారివలన ధర్మకథలు వినుచుఁ దమ్ములతో సుఖమున్న ధర్మజుని గాంచుటకై యొక్కనాఁడు నారదుఁ డరుదెంచి యాతనిఁ బెక్కు రాజనీతి విషయములనుగూర్చి ప్రశ్నించెను. ఈ భాగము ప్రశ్నరూపమున నున్నను నారదుఁడు ధర్మజునకు రాజనీతి ధర్మములను కర్తవ్యమును బోధించినట్లే యున్నది. రామాయణమున భరతుఁడు తన్నుఁ జూడ నరుదెంచినప్పుడు రాముఁ డాతని రాజ్య పరిపాలనమునకు సంబంధించిన పెక్కు ప్రశ్న లడిగియుండెను. ఆ సర్గమునకు కచ్చిత్సర్గ యని పేరు. ఇచ్చట నారదుఁ డడిగిన ప్రశ్నలు రాముఁ డడిగిన యా ప్రశ్నలను దలంపునకుఁ దెచ్చుచున్నవి. ఇచ్చట వ్రాసిన ముప్పది పద్యములలో నన్నయ రాజనీతిని జక్కగ వ్యక్తము చేసియున్నాఁడు. అవగ్రహభయము కలుగకుండఁ జెఱువులను జల పరిపూర్ణగా నుంచుట, హీనులగు కర్షకులకు ధాన్య బీజములను, వణిజులకు శత్త్యైకవృద్ధిగా ఋణములను నొసంగుట, వికలాంగులను అసహాయులను దయతోఁ గాపాడుట, ధనధాన్య బాణ శరాశసనములను జలఘాసరసేంధనాదులను, యంత్రములను, యోధవీరులను, సమకూర్చి దుర్గములను సురక్షితము లొనరించుట మున్నగు నాధునిక సమస్యలుకూడ నందు గోచరించుట గమనింపఁదగిన విషయము. ఈ రాజనీతి సంగ్రహ మయ్యును సకల ముఖ్యవిషయములను స్పృశించుచుఁ గ్రొత్తగా రాజ్యపాలనము నారంభించిన ధర్మజున కొక విధమైన హెచ్చరికయై మిక్కిలి యుచితముగా నున్నది.

దుర్యోధనునికిఁ బాండవులయెడ నీర్ష్యా ద్వేషములను గలిగించినది మయ సభావైభవము. దాని యపూర్వత్వమును అమానుషత్వమును నిరతిశయ సౌందర్య శాలిత్వమును బ్రదర్శించుటకే దిక్పాల సభావర్ణనము కావింపఁ బడినది, "ఇట్టిసభ నెచ్చటనైనఁ జూచితిరా" యని ధర్మజుఁడు నారదు నడుగ నతఁడు మానవలోకేశ్వరుల సభలుకాని ఇంద్రయమ వరుణ కుబేర పంకజాసనుల సభలుకాని దానికి సరిగావని చెప్పెను. ఈ విషయము మయ సభ యెంత యతిలోకమైనదో యది దుర్యోధనుని కెల యంత యీర్ష్య కలిగించెనో తెలుపుచున్నది. మఱియు సభావర్ణన సందర్భమున నారదుఁడు హరిశ్చంద్రుఁ డింద్రసభలో నున్నట్లును పాండురాజాదులు యమసభలో

మున్నట్లును వివరించెను. ధర్మరాజు హరిశ్చంద్రుఁ డొక్కఁడే యింద్రసభ నుండుటకును ఇతర రాజులు యమసభ నుండుటకును గారణ మేమని యడిగెను నారదుఁడు హరిశ్చంద్రునికి రాజసూయ యాగాచరణము వలనఁ గలిగిన మాహాత్మ్యము తెలిపి, పాండురాజుకోరికకూడ నెఱింగించెను. పితృభక్తి తత్పరుఁడైన యుధిష్ఠిరునకు రాజసూయయాగము చేయవలెనను కోరిక జనించెను. రాజసూయ మతివైభవోపేతముగా జరిగెను ఇది దుర్యోధనుని యీర్ష్యను ద్విగుణీకృత మొనరించెను. ఈ విధముగా సభావర్ణనము రాజసూయ యాగాచరణమునకును, రాజసూయయాగము దుర్యోధనుని యీర్ష్యకును దద్ద్వారా ద్యూతమునకును హేతువులైనవి.

రాజసూయయాగ మొనరింపఁ దలఁచినరాజు సమ్రాట్టై యుండవలయును. ఇతర రాజులందఱు నాతనికి లోఁబడి కప్పముకట్టుట కంగీకరింపవలయును. ఆ కాలపు రాజులలో జరాసంధుఁ డతి బలశాలియై శిశుపాలుఁడు సేనాపతియు హంసడిభకులు వామదక్షిణ భుజములవలె సర్వసాధన సమర్థులు నయి తన్ను గొల్చుచుండ క్షత్రియుల నెల్లర జయించి యజయ్యుఁడై యుండెను. అతఁడు మహిలోని రాజుల నందఱఁ బట్టితెచ్చి నిత్యమొక్కొకని సూనరివలె వధించి బలిచేయుచు భైరవపూజ యొనర్చుచుండెను. కృష్ణుఁడు కంసుని జంపినప్పటినుండియు నతఁడు తన కల్లుఁడగుటచే జరాసంధుఁడు కూఁతు ప్రేరణచేఁ గృష్ణుని కనేకవిధముల నుపద్రవ మొనరించుచుండెను. అతఁడొకప్పుడు హంసడిభకులతో మధురపై దండెత్తెను. యదువృష్ణి భోజాంధక వీరు లాతని నెదిరించి యుద్ధము కావించిరి కాని జయింపఁ జాలకపోయిరి. తరువాత వారుపాయ బలమున హంసడిభకు లొండొరుల మరణవార్త విని మరణించున ట్లొనరింప జరాసంధుఁ డసహాయుఁడై మగధపురమునకుఁ దిరిగిపోయెను. అతనితోడి వైరము బలవంతమగుటచే యాదవులు మధురలో నుండఁజాలక కుశస్థలమునకు వచ్చి రైవతక పర్వతమున గొప్ప దుర్గములు నిర్మించుకొని సుఖముగాఁ గాలము గడుపుచుండిరి. కృష్ణు నంత వానికిఁ గూడ నసాధ్యుఁడైన యా జరాసంధు నెట్లో జయించినఁగాని ధర్మరాజునకు రాజసూయ యాగాచరణార్హత కలుగదు. అందుచేతనే కృష్ణుఁ డతనిఁ జంపినపిమ్మటనే ధర్మజున కురుతర సామ్రాజ్య వైభవము సుస్థిరముగఁ జేకూరుననియు, నప్పుడు రాజసూయయాగము

చేయుట సాధ్యమగుననియుఁ బలికెను. తరువాత నతఁడు ధర్మజు నొప్పించి భీమార్జునులతో నరిగి, భీమునిచే జరాసంధుని జంపించెను. జరాసంధ వధ వలన మూఁడు ఘనలాభములు చేకూరెను. ఒకటి ధర్మజుఁడు రాజసూయ యాగ మొనరించుట కానుకూల్య మేర్పడెను. రెండు బలవద్వైరి వినాశముచేఁ గృష్ణునకును యాదవులకును మనస్సంతాపము తొలఁగెను. జరాసంధునిచే బంధితులైన రాజులెల్లరును విమోచితులై ధర్మజునియెడఁ గృతజ్ఞులై యుండుట సంభవించెను

జరాసంధ వధానంతరము భీమార్జున నకుల సహదేవు లపార చతురంగ బలసమేతులై నలుదెసల కరిగి యాయా దిక్కులనున్న రాజులచే నసంఖ్యాతములైన ధనవస్తు వాహన నివహములు గొనివచ్చిరి. దీనివలన రాజసూయమునకుఁ గావలసిన ధనసంపదలు చేకూరుటయేకాక ధర్మజుని సార్వభౌమత్వముకూడసుప్రతిష్ఠిత మయ్యెను అప్పుడుమంత్రులుదిగ్విజయ లబ్ధ వైభవసమృద్ధిని వర్ణించి "యవనీశులెల్ల నీ యనుజవీర్య విజితులయి త్వదీయ శాసనస్థు లయిరి జగతీశ! యిదియ నీ యజ్ఞకార్యమునకు నవసరం"బని హెచ్చరించిరి తరువాత ధర్మరాజు రాజసూయ యాగదీక్షితుఁ డయ్యెను.

జరాసంధ వధ వలెనే శిశుపాలవధయు మిక్కిలి ముఖ్యమైనది. శిశుపాలుఁడు సామాన్యుండు కాఁడు. అతఁడు తొల్లిటి జన్మములందు హిరణ్యకశిపుఁడును, రావణుఁడునై శ్రీమన్నారాయణునితో వైరము సాధించిన వాఁడు, శ్రీమన్నారాయణుఁడు నరసింహ రామావతారములెత్తి వారిని సంహరించెను. అతఁడు శ్రీకృష్ణావతారముఁ దాల్చుటకుఁగల ప్రయోజనములలో శిశుపాల వధయు నొకటి. శిశుపాలునితల్లి సాత్వతి శ్రీకృష్ణునకు మేనత్త. ఆమె తన కుమారుని కాతనివలన మరణము కలుగునని యెఱింగి యతఁ డొనరించు శతాపరాధములు సైపుమని ప్రార్థించెను. కృష్ణుఁ డామె కట్లే చేసెదనని వాగ్దానమొసంగి శతాపరాధములు సైరించి, రాజసూయ యాగ సందర్భమున శిశుపాలుఁడు గర్వితుఁడై తన్ను నిందించిన సమయమునఁ జక్రముచే నాతని కంఠము ఖండించెను. దానితో నగ్ర్యపూజవిషయమున నుప్పతిల్లిన వివాదము చల్లారెను. రాజసూయము నిర్విఘ్నముగాఁ బూర్తియయ్యెను. శ్రీకృష్ణుఁ డవతారమూర్తియై చేయవలసిన మహాకార్యములలో నొకటి నెఱవేఱెను.

ధృతరాష్ట్రుఁడు కొడుకుమేని కార్శ్య వైవర్ణ్యములు తెలిసికొని దుఃఖితుఁడై "ఏమి కొఱఁత యయ్యె. రాజ్యభోగ సుఖపరాఙ్ముఖత్వముఁ బొందనేల" యని యడిగినప్పుడు దుర్యోధనుఁడు రాజసూయ వైభవమును వివరముగా వర్ణించి ధర్మరాజుతో జూదమాడుట కనుజ్ఞ యిమ్మని వేఁడుకొనెను. ధృతరాష్ట్రుఁడు విదురు నడిగి యాతని యనుమతము వడసి వర్తింతమని పలికెను. ధర్మపరాయణుఁడైన విదురుఁడు కలహకారణమైన ద్యూతమున కంగీకరింపఁడని దుర్యోధనుఁ డెఱుంగును. అందుచే నతఁడు "దీనికొడఁబడు మొడఁబడవేని సర్వభక్షుచేత భక్షితుండ నగుదు" నని మొండి పట్టు పట్టెను. అప్పుడు ధృతరాష్ట్రుఁడు వేవురు శిల్పాచార్యులచే రమ్యముగా నొకసభ నిర్మింపఁజేసి యందు జూదమాడుటకు ధర్మజుని దోడ్కొని రమ్మని విదురుని బంపెను. విదురుఁడు భీష్ముని కంతయు నెఱిఁగించి యది యపకర్మమని వెడలక యుండిపోయెను. తరువాత ధృతరాష్ట్రుఁ డెన్నివిధములఁ జెప్పినను వినక దుర్యోధనుఁడు ద్యూతార్థమై ధర్మజుఁ బిలువఁ బంపుమని మరల వేఁడుకొనెను. ధృతరాష్ట్రుఁ డెట్టకేల కొడంబడి విదురుని రావించి ద్యూతమునకై ధర్మజుని గొనిరమ్మని పంపెను. విదురుఁ డనిష్టముగ నే యరిగి ద్యూతమునకు ధర్మజుని గొనివచ్చెను. మయసభనుగూర్చి యీర్ష్యా ళువై సంతపించుచున్న దుర్యోధను ననునయించుటకై ధృతరాష్ట్రుఁడు శిల్పాచార్యుల రావించి నిర్మింపఁజేసిన సభ దుర్యోధనుని యీసును దగ్గింపఁజాలక పోవుట యటుండ జూదమాడుటకును, దుశ్శాసనుఁడు ద్రౌపది వలువ లొల్చి యామె నవమానించుటకును, పునర్ద్యూతమునకును నెలవై దారుణమైన పరిణామమునకు దారి తీసెను.

ధృతరాష్ట్రుఁడు ద్రౌపదీ పరాభవ వృత్తాంతమును, భీమసేనుని భీషణ ప్రతిజ్ఞను, ఉత్పాతములు పుట్టుటను విని, దుర్యోధనుని మందలించి, ద్రౌపది కామె కోరిన వరము లొసంగెను. పిమ్మట నాతఁడు ధర్మజుని రావించి స్వరాజ్యము గ్రహించి యెప్పటియట్ల యేలుకొనుమని యింద్రప్రస్థమునకుఁ బంపెను. ఇది పునర్ద్యూతమునకును, శకుని యం దపూర్వమైన పణము నేర్పఱుచుటకును గారణమయ్యెను. పునర్ద్యూతమున నోడి యా నియమము ననుసరించి ధర్మజుఁడు భార్యానుజులతో నడవికిఁ బోవలసివచ్చెను. అడవి కేగు సమయమున భీమార్జుననకులసహదేవులు భయంకరములైన శపథములు గావించిరి.

పాండవులు హస్తినాపురము విడిచి వెడలిన తరువాతఁగూడ సంజయుఁడును విదురుఁడును దుఃఖితుఁడైన ధృతరాష్ట్రునోదార్చి పాండవులఁ బిలిచించి వారి రాజ్యము వారికీవలసినదని యుపదేశించిరి. ధృతరాష్ట్రుఁడా పలుకులు వినియు విననియట్లుపేక్షించి యూరకుండెను. సభాపర్వమున నీ విధముగా నన్నయ కార్యకారణ సంబంధముతోఁ గూడియుండునట్లుగా వస్తుసంవిధానము గావించి దానిని సహృదయ హృదయానంద సంధాయకము నొనరించెను.

**కథాకథనము :** నన్నయ తన కవిత్వమునందలి గుణములలోఁ బ్రసన్న కథాకలితార్థ యుక్తి యొకటి యని చెప్పెను. ప్రసన్నమనఁగాఁ బ్రసాద గుణముతోఁ గూడినది. "బుధులచేఁజెప్పఁబడకయు సుఖ శబ్దార్థ సంయోగమువలన శబ్దముగాని యర్థముగాని ప్రతీయమానమగుట ప్రసాద మనఁబడు" నని భరతుఁడు ప్రసాదగుణమును నిర్వచించెను. ప్రసాదగుణము శబ్దార్థములు రెండింటికిని సంబంధించియుండుననియు ఝటితివ్యవభాసకత్వమే దాని ప్రధాన లక్షణమనియు నతని యభిప్రాయము. దీనినిబట్టి ప్రయోజన రహితములైన సందర్భములను బునరుక్తులను నుజ్జగించుచు విన్నంత మాత్రమున నందలి తత్త్వమును స్ఫురింపఁ జేయుటయే కథను బ్రసన్నముగా నొనరించుట యని చెప్పవచ్చును. నన్నయ ప్రధాన కథ యందును ఉపాఖ్యానము లందునుగూడఁ బ్రసన్నతను గల్గించుటకుఁ బ్రయత్నించియుండెను.

దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకుఁగొనిరమ్మని ప్రాతికామిని బంపినప్పుడామె యతనిని "కిం ను పూర్వం పరాజైషీ రాత్మానం మాం ను భారత" అని ధర్మరాజు నడిగిరమ్మనెను. అతఁడు సభ కరిగి ద్రౌపదీ వాక్యము నెఱింగించెను. ధర్మరాజు గతసత్త్వునివోలె నిశ్చేష్టుఁడై యూరకుండెను. దుర్యోధనుఁడు "ద్రౌపది స్వయముగనే యా ప్రశ్న నడుగవచ్చును. ఆమెను సభకుఁగొనిర"మ్మని ప్రాతికామిని మరలఁ బంపెను. ప్రాతికామి ద్రౌపది కడ కేగి యా విషయము తెల్పెను. ద్రౌపది "విధివిధాన మిట్లున్నది కాఁబోలును. దైవమే నన్ను రక్షించు" నని భావించి యూరకుండెను. తరువాత ధర్మరాజు ద్రౌపదికడ కొక దూతను బంపెననియు (ద్రౌపద్యాస్స మ్మతం దూతం ప్రాహిణోత్) ద్రౌపది యేకవస్త్రయు నధోనీవియునై యేడ్చుచు సభ కరుదెంచి మామముందు నిల్చెననియు మూలమున నున్నది.

దుర్యోధనుఁడు ప్రాతికామితో "ఇహైవేతాఽమానయ ప్రాతికామిన్ ప్రత్యక్ష మస్యాః కురవోబ్రువన్తు (60–16)" అని ప్రాతికామిని మరలఁ బంపెను. ప్రాతికామి ద్రౌపదీకోపభీతుఁడై యట్లు చేయుటకు జంకుచుండుట యెఱింగి దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకుఁ గొనిరమ్మని దుశ్శాసను నాజ్ఞాపించెను. ద్రౌపది భీతయై స్త్రీలున్నకడకుఁ బరువెత్తఁగా దుశ్శాసనుఁడామెను వెంటనంటి కేశములు పట్టుకొని సభ కీడ్చుకొనివచ్చెను.

పై వృత్తాంతమును బట్టి ధర్మజుఁడు దూతను బంపఁగా ద్రౌపది యేడ్చుచు సభ కరుదెంచెనని తెలియుచున్నది. అప్పుడు దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకుఁ గొనిరమ్మని ప్రాతికామిని మరలఁ బంపుటకును, ఆతఁడు భయపడుచుండఁగా దుశ్శాసను నామెను గొనిరమ్మని యాజ్ఞాపించుటకును అవసరములేదు. నన్నయ ధర్మజుఁడు ద్రౌపదికడకు దూతను బంపిన వృత్తాంతమును విడిచివైచి యామె రెండవమాఱు తనదగ్గఱకు వచ్చిన ప్రాతికామి వెంటనే సభ కరుదెంచెననియు, దుర్యోధను నానతిపై దుశ్శాసనుఁ డామెను కేశాకర్షణమున సభ కీడ్చుకొని వచ్చెననియు రచించి పునరుక్తి పరిహారణ పూర్వకముగాఁ గథకుఁ బ్రసన్నత గలిగించెను.

ధృతరాష్ట్రుఁడు దుర్యోధసుని సంతాపమును విని శిల్పాచార్యులను రావించి రమ్యమైన సభ నిర్మింపఁజేసెను. తరువాత నతఁడందు ద్యూత మాడుటకై ధర్మజుని గొనిరమ్మని విదురుని నియోగించెను. ఇచ్చట మూలమున

ఇత్యుక్తో విదురో ధీమాన్ నైత దస్తీతి చింతయన్
ఆపగేయం మహాప్రాజ్ఞ మభ్యగచ్ఛ త్సుదుఃఖితః 45–58

అని విదురుఁడు భీష్మునికడ కరిగెనని చెప్పఁబడినది. తరువాత 46 వ అధ్యాయమున కథ వేఱు త్రోవ త్రొక్కుచున్నది. విదురుఁడు భీష్మునికడకేగి యేమి చెప్పెనో యేమి చేసెనో యందు వివరింపఁబడి యుండలేదు. జనమేజయుఁడు ద్యూత వృత్తాంతము చెప్పు మనఁగా వైశంపాయనుఁడు చెప్పఁ దొడంగెను. ధృతరాష్ట్రుఁడు విదురు నభిప్రాయము నెఱింగి ద్యూతము మానుమని దుర్యోధనుని కుపదేశించెను. దుర్యోధనుఁడు రాజసూయ వైభవమునఁ దనకు జరిగిన యవమానమును మూఁడధ్యాయములలో (47, 48, 49)

వివరించెను. ధృతరాష్ట్రుఁ డాతని ననునయించుటకై యత్నించెను కాని లాభము లేకపోయెను. దుర్యోధనుఁడు శకుని ప్రేరితుఁడై ద్యూతప్రసంగము మరలఁదెచ్చెను ధృతరాష్ట్రుఁడు విదురునితో నాలోచించి నిశ్చయించెదనని చెప్పెను. విదురుఁడు ద్యూతమున కంగీకరింపఁడని తెలిసినవాఁ డగుటచే దుర్యోధనుఁడు పట్టుపట్టెను. ధృతరాష్ట్రుఁడు సభను నిర్మింపఁజేసి సుహృద్ద్యూతార్థమై ధర్మజుని గొనిరమ్మని విదురు నాజ్ఞాపించెను విదురుఁడు ద్యూతము తనకు సమ్మతము కాదని తెల్పియు ధృతరాష్ట్రుని బలవంతముచే నరిగి ధర్మజుని దీసికొని వచ్చెను.

నన్నయ రచనలోఁగూడ నీ సందర్భమునఁ గొంత పునరుక్తి లేకపోలేదు కాని యాతఁడు కొన్ని యసందర్భములను దొలఁగించుటకును గొన్ని యంశములను సమర్థించుటకును యత్నించెను. విదురుఁడు భీష్మునికడకరిగిన సందర్భమున నన్నయ "ఆతండును నాపగేయుని కంతయు నెఱింగించి యిది యపకర్మంబనుచునుండె" నని యాతఁ డాకార్యమునందే మగ్నుఁడై యుండినట్లు సూచించెను. ధృతరాష్ట్రుని యుపదేశముచే దుర్యోధనుఁడు ద్యూత వ్యవసాయమునుండి మరలునేమోయని యాతఁడు కొంతసేపు నిరీక్షించుచుండెను గాఁబోలును కాని యాతఁడనుకొనినట్లు జరుగలేదు. దుర్యోధనుఁడు ద్యూతమునకై ధర్మనందనుని దప్పక రావింపవలయునని పట్టుపట్టెను. ధృతరాష్ట్రుఁడు చేయునదిలేక భీష్మునికడ నిరీక్షించుచున్న విదురుని బిలిచి ధర్మజుని గొనిరమ్మని నియోగించెను మూలమున "విదురునితో నాలోచించి కార్యనిశ్చయ మొనరించెదనని" ధృతరాష్ట్రుఁడు రెండుమార్లు చెప్పినట్లున్నది. అట్లే సభా నిర్మాణ ప్రసంగముకూడ నందు రెండుమార్లు చెప్పఁబడినది. నన్నయ యీ పునరుక్తులను దొలఁగించెను. ధృతరాష్ట్రుఁడు తాను నిర్మింపఁ జేసిన సభ దుర్యోధనునికిఁజూపి, జూదమువలని దోషము లెఱిఁగించి యా సభ యందధికములైన దక్షిణలిచ్చి యిష్టమైన యజ్ఞ మాచరింపుమని యాతని ననునయించెను. దుర్యోధనుఁడు ధర్మజునితో జూదమాడఁ గలుగుటయే నాకు యజ్ఞమని పలికి ధృతరాష్ట్రుఁడు నిర్మింపఁజేసిన సభకును ధర్మరాజు సభకును గల వ్యత్యాసము తెల్పుటకోయనఁ దాను జూచిన సభ వైభవమును వర్ణింప మొదలుపెట్టెను. దానినిచ్చట మరల వర్ణించుట కీ విధముగా నన్నయ యొక హేతువును ప్రదర్శించెను.

ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికిఁ గోరినవరము లొసంగి, యామె ధర్మ జ్ఞతకు సంతసిల్లి, ధర్మరాజునకు మరల రాజ్యము నేలుకొమ్మని సమర్పించెను. నన్నయ ఈ సందర్భమున "దానినంతయు భీమసేనుండు విని" సతి కారణ మునఁ దమకు రాజ్యము ప్రాప్తమగుట తలంచి మిక్కిలి కోపించెను. ధర్మజుఁ డాతని ననునయించి యనుజ భార్యాసహితుఁడై యింద్రప్రస్థపురమున కరి గెను. నన్నయ ఈ సందర్భముననే "దుశ్శాసనుచేత నంత వృత్తాంతంబును విని దుర్యోధనుఁడు" కర్ణ శకుని సైంధవులతో మరల నాలోచించుటకు మొదలుపెట్టెనని వ్రాసియుండెను. పై రెండు సందర్భములందును ప్రయో గింపఁ బడిన 'విని' యను పదముచే వరరాజ్య ప్రదానకార్యము భీమ దుర్యో ధనుల పరోక్షమున జరిగెనని వ్యక్తమగుచున్నది. ఆ సమయమున వారు సమక్షముననే యుండినచో నది యట్లు జరిగి యుండకపోయెడిది. ఈ విధ ముగా నన్నయ కొన్నిచోట్లఁ గథా భాగముల నుచితపద ప్రయోగముచే ధ్వనింపఁ జేయుచుండును.

జరాసంధ జనన వధ వృత్తాంతము, శిశుపాల జనన వృత్తాంతము, అగ్ని పారదారికుఁడైన వృత్తాంతము, వృద్ధహంస వృత్తాంతము, విరోచన సుధన్వుల వృత్తాంతము అనునవి సభాపర్వమునఁ గల యుపకథలు. ఇందు మొదటి రెండును భారతకథతో సన్నిహిత సంబంధము కలిగినట్టివే. మిగిలిన మూఁడును నతి స్వల్ప పరిమాణము గలవి. నన్నయ వాని నాయాసందర్భ ములం దతి సంగ్రహముగను రమణీయముగను జెప్పియుండెను.

ధర్మరాజు రాజసూయ యాగాచరణాభిలాష నెఱింగించి తన్నందు నియోగింపఁ గృష్ణుని వేడుకొన నతఁడు ధర్మరాజు రాజసూయయాగము చేయుటకు సర్వవిధముల నర్హుఁడని తెలిపి యందలి క్లేశముకూడ వెల్లడిం చుటకై జరాసంధుని యసాధారణ బల సామర్థ్యములను వివరించెను. ఆ సంద ర్భమున కృష్ణుఁ డతఁడు మధురపై దండెత్తి వచ్చుటయు హంసడిభకుల మరణముచే నా యాపద తాత్కాలికముగాఁ గడచినను వానితోడి వైరము బలవంత మగుటచేఁ దాము మధుర నుండఁజాలక కుశస్థలమున కరుదెంచు టయు నెఱింగించెను. ధర్మజున కది యాశ్చర్యము కలిగించుటచే నతఁడు జరాసంధున కట్టి యజేయ భుజ విక్రమాధిక్య మెట్లుకలిగెనో తెల్పుమని కృష్ణు నడిగెను. కృష్ణుఁ డాతని జనన వృత్తాంతమును, వరప్రాప్తియు, బల

సామర్థ్యములును విశదీకరించెను. బృహద్రథుఁడు చండకౌశికుఁడిచ్చిన చూత ఫలమును దన యిరువురు భార్యలకు సమముగా విభజించి పెట్టెను. వారి కర్ధార్ధ శరీరభాగములతో మనుజశకలము లుదయించుట కదియే కారణము, జర మెదలుచున్న ప్రయ్యలదిమి రెండిటిని గూడఁ బట్టఁగనే యవి యొండొంటితోఁ జక్కగా నంటుకొని రెండు నొక్కఁడయ్యెను. జర యను రాక్షసిచే సంధింపఁబడినవాఁ డగుటచే రాజాతనికి జరాసంధుఁడని పేరు పెట్టెను. అతఁడు పెరిఁగి పెద్దయైనపిమ్మట చండకౌశికుఁడు బృహద్రథు ప్రాసాదమున కరుదెంచి బాలుని జూచి సంతోషించి యాతఁడు శివుని సన్నిహితుఁ జేసికొనుననియు, దివ్యాస్త్రము లతని దేహమును భేదింపఁ జాలవనియు,నతఁడు కుమారునంతియ శక్తిసంపన్నుఁడగుననియు వచించెను ఆయుధ యుద్ధమున నాతని నెవ్వరును జయింపజాలరని శివుఁడు వరమొసంగెను. అందుచేతనే కృష్ణుడు మల్లయుద్ధమున భీమునిచే నాతనిఁ జంపించెను. "ఏ యాయుధంబున నెమ్మెయిఁ బోరంగఁ నిష్టమయ్యెది యుత్సహింపుఁ" డని జరాసంధుఁడు పలుక కృష్ణుఁ "డొక్కనితోఁ బల్వు రుద్ధతులయి పూని యుద్ధంబు సేయుట యుచితమగునె... మా ముప్వురిలో నొక్కరుని మహా బలాఢ్యుఁ గోరికొనుము. వాఁడు ఘోరాజిలో నిన్ను మొనసి మల్లయుద్ధమున జయించు" నని సమాధానమిచ్చెను. భీముఁడు జరాసంధునితో యుద్ధ మొనరించుచుండఁ గృష్ణుఁడు "భీముని అయ్యనిలదేవు బలంబును నీ బలంబు భాసురముగ మాకుఁజూపు"మని హెచ్చరించెను. అంత భీముఁ డనిలదేవునిఁ దలఁచి తత్ప్రసాదమున నధికసత్త్వ సమేతుఁడై జరాసంధుని వధించెను. అనవసర వర్ణనలు కాని, అనావశ్యక వివరములుకాని లేకుండ నన్నయ జరాసంధుని వృత్తాంతమును హృద్యముగా సాగించెను.

శిశుపాలుఁడు కృష్ణుని నిందించుటతో నాగక భీష్మునిఁ గూడ రూక్షాక్షర వచనముల నాక్షేపించుచుండ భీముఁ డాగ్రహావిష్టుఁడై శిశుపాల నిర్మూలనాభీల సంరంభము ప్రదర్శించెను. అప్పుడు భీష్ముఁ డాతనివారించి శిశుపాల జనన వృత్తాంతము నెఱింగించెను, శిశుపాలుఁడు చతుర్భుజలలాలు నేత్రములతోఁబుట్టి రాసభరవముతో నేడ్చుచుండ జననీజకునలు భయవిస్మయాధీన మనస్కులై కలఁత నొందుచున్న సమయమున నశరీరవాణి "యెవ్వరేని వీనినెత్తి కొనుడు మిగిలియున్న బాహుయుగళంబుఁగన్నును నడఁగు

వీని కతఁడ యంతకుం"డని పలికెను. కృష్ణుఁడు బలరామునితోఁగూడ మేనత్త యగు సాత్వతిని జూడనరుగ నామె శిశుపాలుని వా రిరువురిచేతికి నెత్తికొన నిచ్చెను. కృష్ణుఁ డెత్తుకొనఁగనే యాతని మిక్కిలి చేతులును మిక్కిలి కన్నును అడఁగెను. అప్పుడు సాత్వతి కృష్ణునివలనఁ దన సుతునికి మరణ మగునని యెఱిఁగి యతని శతాపరాధములు సైఁపవలెనని ప్రార్థించెను. కృష్ణుఁ డట్లే వాగ్దానము చేసెను. శిశుపాలుఁడు కృష్ణునిచేతనే నిహతుఁ డగుననియు నన్యుల కప్రతిహతుఁడనియుఁ దెల్పుటకై భీష్ముఁ డీ వృత్తాంతమును భీముని కెఱింగించెను. నన్నయ రచించిన శిశుపాలవధ వృత్తాంతము మనోహరము లైన యుక్తిప్రత్యుక్తులతోఁ గూడి సరసమై శ్రీకృష్ణుని పరమేశ్వరత్వమును వ్యక్త మొనరించుచున్నది.

శిశుపాలుఁడు భీష్ము నధిక్షేపించుచు ధర్మమార్గమున వర్తిల్లుఁడని పక్షులనెల్ల శిక్షించుచు వాని యండముల భక్షించి వానిచే వధింపఁబడిన వృద్ధహంసకథ వివరించెను ఆ హంసవలెనే భీష్ముఁడుకూడ ధర్మశిక్ష కావించుచుఁ గౌరవుల కాపద యాపాదించుచుండెనని తెల్పుటకై అతఁడీ కథను జెప్పెను. ధర్మశిక్షా నటనము హంస భీష్ములయందలి సమానధర్మము. దుర్యోధను నానతిచేఁ దన్ను సభకుఁ గొనిపోవచ్చిన ప్రాతికామిని ద్రౌపది "మున్ను దనోడ్డి టువడి మఱినన్ను నోటువడియెనో నన్ను మునోడ్డి టువడి విభుఁడు గ్రననఁ దనోడ్డిటువడియెనో" తెల్పుమని ప్రశ్నించెను తరువాత నామె ప్రాతికామి వెంటనే సభకరుదెంచెను. దుశ్శాసనుఁ డామెను కేశాకర్షణమున సభలోని కీడ్చితెచ్చెను. పాండవులు చేయునదిలేక దుఃఖించుచుండిరి. అప్పుడు వికర్ణుఁడు ద్రౌపదీ ప్రశ్నమును జర్చించి యామె యధర్మవిజిత యని నిర్ణయించెను. కర్ణుఁ డాతని యభిప్రాయమును బ్రత్యాఖ్యానించెను. దుర్యోధనుఁడు ద్రౌపదీ పాండవుల వస్త్రము లపహరింపుమని దుశ్శాసనుని నియోగించెను. దుశ్శాసనుఁడు ద్రౌపదీ వస్త్రాపహరణము కావింపఁ బూని యట్లు చేయలేక లజ్జితుఁడై యూరకుండెను. భీముఁడు భీషణప్రతిజ్ఞ కావించెను. సభ్యులు ధృతరాష్ట్రులను అతని సుతులను నిందించుచు వృద్ధరాజులు ద్రౌపదీ వాక్యములు విచారింపక యుపేక్షించిరని చింతించుచుండిరి. అప్పుడు విదురుఁడు కలిగించుకొని వికర్ణుని ధర్మనిర్ణయమును బ్రశంసించి ధర్మసందేహము తీర్పనినాఁడు సభ్యు లనృత దోషమునం దర్థ మొందుదురనియు ధర్మ మెఱిఁ

గియు లాభలోభ పక్షపాతబుద్ధి నొందుగాఁ జెప్పిన ననృత దోష ఫలము పూర్తిగాఁ బొందుదురనియుఁ దెల్పి దానికిఁ బ్రమాణముగా విరోచనసుధన్వుల వృత్తాంత మెఱింగించెను. ఈ కథలో కశ్యపుఁడు ప్రహ్లాదునికి ధర్మ మధర్మ విద్ధమై సభకు వచ్చిన దానిఁ దీర్పని సభ్యులు ధర్మవిద్ధు లగుదురనియు, వా రధర్మము నాపనిచో నాయధర్మమునం దొక్కపాదము సభ్యులను, ఒక్కపాదము భూపతిని, దక్కినది కర్తను బొందుననియు. నధర్మము విధ్యుక్తమైనచో నొక్క కర్తనే పొందుననియుఁ జెప్పి ధర్మముతప్పక చెప్ప వలయునని వక్కాణించెను. ఈ విషయమును సభ్యుల దృష్టికిఁ దెచ్చుటకే విదురుఁ డీ కథ నెఱింగించెను. అతఁడట్లు చెప్పిన పిమ్మటఁగూడ దుర్యోధన భయమున సభ్యులెవ్వరును బలుకరైరి. భీష్ముఁడు మాత్రము దుఃఖితయైన ద్రౌపదిని జూచి యామె ప్రశ్న కొక్క యుధిష్ఠిరుఁడే యుత్తరము చెప్ప వలయుననియు ధర్మసూక్ష్మత యెవ్వరికైన నెఱుఁగ గహనమనియుఁ దెల్పి యూరకుండెను.

అగ్ని పారదారికుఁడైన కథ సహదేవుఁడు దక్షిణ దిగ్విజయ యాత్ర కరిగినప్పుడు చెప్పఁబడినది. అతఁడు మాహిష్మతీపురముపై విడిసినప్పు డగ్ని సహదేవుని సేనపై నెగసెనని వైశంపాయనుఁడు తెలుప విని జనమే జయుఁ డగ్ని యట్లు చేయుటకుఁ గారణమేమని యడిగెను. అతఁడు మాహి ష్మతీ విభునకు నగ్ని వరమిచ్చిన వృత్తాంతము తెలిపెను. సహదేవుఁడు మాహిష్మతిపై దండెత్తుటకు రాజసూయ యాగాచరణమే కారణము కాని పరరాజ్యాక్రమణౌద్ధత్యము కారణము కాదు. యాగము దేవతలకును ముఖ్యముగా నగ్నికిని బ్రీతికారణమైనది అట్టియెడ నగ్ని సహదేవుని సేన నాక్రమించి యాగమునకు విఘ్నము కలిగింపనెంచుట యాశ్చర్యకరముగాఁ దోఁచును. ఈ యాశ్చర్యమే జనమేజయునిచే నట్లు ప్రశ్నింపఁజేసినది. సహ దేవుఁ డగ్నిని స్తుతించునప్పుడు "యజ్ఞంబులును నీవ హవ్యవాహ! ధర్మ నిత్యుండైన ధర్మజు కావించు క్రతువు భవత్ప్రీతికరముగాదె. దానికి విఘ్నంబు దలఁచుట ధర్మువె" యని పలుకుటయు నీ విషయమునే సూచించు చున్నది. సహదేవ ప్రార్థితుఁడై యగ్ని సేనలకుఁ దనవలన భయములేకుండఁ జేసెను. అప్పు డాతఁడు మాహిష్మతీవిభుని కిచ్చిన వరము మోఘము కాలేదా యను ప్రశ్న యుదయించును. మాహిష్మతీవిభుఁ డగ్ని వర మడుగు మన్నపుడు

ఇప్పురంబు జయింపంగ నెవ్వరేని, వత్తురుద్ధతులయి శత్రువరులు వారు
దర్పమేది నీచేత నిర్దగ్ధులై వి,హీనులగునట్లుగా వరమిమ్ము నాకు

అని యడిగెను. ఇప్పుడు వచ్చిన శత్రువు లుద్ధతులై వచ్చినవారు గారు. యాగాచరణాంగముగా వచ్చినవారు. అందుచే నగ్ని యొనర్చిన కార్యమున వరభంగదోషము లేదు.

**వర్ణనలు :** నన్నయ వర్ణ్యమునకు సంబంధించిన వివిధాంశములను సంపూర్ణముగా వివరించి దాని సమగ్ర స్వరూపమును బఠితలకు సాక్షాత్కరింపఁజేయును. అతని వర్ణనలు నాతిదీర్ఘములయ్యు సమగ్రములై మిక్కిలి యుదాత్తములును గంభీరములునై విలసిల్లుచుండును. మయుఁడు నిర్మించిన సభయందలి మణిమయములైన దూలములను, కొలనులను, యంత్రములను, వనములను, దాని ప్రమాణమును, విభూతిని అతఁడు చక్కగా వర్ణించెను. దిక్పాలురయు బ్రహ్మయొక్కయు సభలను వర్ణించు నప్పుడాతఁడు వాని మణిమయత్వమును, విభూతిని, ప్రభావమును, ప్రమాణమును, అందుండు జనులను, బరివారమును సమగ్రముగా వివరించెను. ఇంద్రుఁడు దివిజోత్తములు గొలువ శచీసమేతుఁడై "వరాప్సరోంగనాయత విలసత్కటాక్ష కుసుమార్చిత సుందర వక్త్రి చంద్రుఁడై" కొలువుండు ననియు, బ్రహ్మసభ "ఈ వియత్తలమను కంబ మొక్కటియ తాల్పఁగ సుస్థిరమై నిజప్రభావలి శశివారిజమిత్రులమండలములను వెలిఁగించుచుండు" ననియుఁ, గుబేరుని "సభ కనకమయతరులతాలంకృతమయి తటిల్లతా విచిత్ర శరదంబు దంబు ననుకరించు" ననియు, వరుణుని సభయందు సకల సముద్ర సరిత్సరసీదీర్ఘికాదులును దిగ్ధాత్రీధాత్రీధరములును దేహవంతములై వచ్చి కొల్చుచుండు ననియు నాతఁడు చేసిన వర్ణన మాయా సభలయుఁ దత్పాలకులయు స్వరూపము లను బ్రత్యక్షము కావించుచున్నది.

జరాసంధుఁడు భీమునితో మల్లయుద్ధమున కేగునప్పుడు వెంద్రుకలు పాచి ముడిచి గంటెసంగఁ దాల్చెనని చెప్పుట నన్నయ నిశిత పరిశీలనమును వెల్లడిచేయుచున్నది. అది మల్లయుద్ధ మగుటచే నాతఁడు మహోగ్రాయస పరిఘాయిత కఠినాయత భుజ దండ దారుణాఘాతములను మాత్రమే వర్ణించెను. భీముఁడు జరాసంధుని ముక్కునను, వాతను, గర్ణరంధ్రములను రక్తధార లొలుక శతవారములు వీచె ననుట మిక్కిలి సహజముగానున్నది,

నన్నయ భీమపార్థనకులసహదేవుల చతుర్దిగ్విజయములను వర్ణించుచు నానాఁటి భారతదేశ భౌగోళిక స్వరూపమును, దేశములయుఁ దద్విభులయు నామములను జక్కఁగా వివరించెను. ఆ సోదరులు గొనివచ్చిన ధనవర్గమును దెల్పుచు మంత్రులు దానిని మేరుశైలముతోడను, కుబేరుని నిధులతోడను కల్పవృక్షముతోడను బోల్చుట తత్సమృద్ధిని వేయి విధముల వెల్లడి చేయు చున్నది.

రాజసూయయాగమునకు వచ్చిన వివిధదేశ భూపాలురను, యజ్ఞ పరికరములను, ఋత్విగాదులను, వేదనాదములను వర్ణించి నన్నయ యా సందర్భమున యజ్ఞవాతావరణమును గల్పించెను. ఆ సమయమున వేదా శీర్వాద వాదిత్రనినాదము లన్యనాదము జనులకు వినఁబడకుండఁ జెలంగెనని చెప్పుట యా నాదముల సర్వతోముఖత్వమును వెల్లడించుచున్నది. నన్నయ రాజసూయయాగముయొక్క మహావైభవమును దానుగాఁ జెప్పక ద్వితీయా శ్వాసమున దుర్యోధనుఁడు తండ్రితోఁ దన మనస్తాపమును వివరించునప్పు డాతనిచేఁ జెప్పించెను అతఁ డఖిలజలధివలయితక్షోణిలో సఖ్య సంబంధములఁ జేసి చక్రధరుఁడును ద్రుపదుఁడును దప్పఁ బాండవుల కరిపెట్టని రాజు లెవ్వ రును లేరనియు, శైలకాననద్వీప విశాలమైన వసుమతీ చక్రమంతయు వారికి వశమయ్యెననియు, ధర్మపుత్రు గృహము సర్వరత్నాకరైక ప్రశస్త రత్న పుంజముల కాస్పదమై యుండెననియుఁ, బాండవుల విభవ మాఖండల విభ వముకంటెను గడు మిక్కిలియై పెరిఁగె ననియు వివరించెను మఱియు నాతఁ డేయే రాజు లేయే కానుక లొసంగిరో, యెంత యన్నదానము జరిగెనో, ద్రౌపది యెట్లు వర్తించెనో, ధర్మజుఁ డెట్లు బ్రాహ్మణాదుల గౌర వించెనో కన్నులకుఁ గట్టినట్లు వర్ణించెను.

ద్యూతమున ధర్మజుఁ డొక్కొక్క యొడ్డున నేమేమియొడ్డి యోడెనో నన్నయ విశదముగా వర్ణించెను. ద్రౌపదీ వస్త్రాపహరణానంతరమును, పాండవులు వనమున కరుగునప్పుడును నన్నయ వర్ణించిన యుత్పాతములు విలక్షణములై భవిష్యన్మహాసంగ్రామమును గౌరవులకుఁ గలుగనున్న యరిష్ట మును సూచించుచున్నవి.

విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవు లడవికిఁ బోయిన తీరు చెప్పు సందర్భమున నన్నయ వ్రాసిన సీసము వారి యాకారచేష్టల నత్యంత విశద

ముగా వర్ణించుచున్నది. వానికి విదురుఁడు కావించిన వివరణముకూడ విపులమును విస్పష్టమునై యున్నది.

ఈ విధముగా సభాపర్వమున నన్నయ కావించిన వర్ణనలెల్ల నుదాత్తములును, సహజములును, రమణీయములునై, కథాగమనమున కడ్డము కలిగింపక పాఠకుల హృదయముల కానందము కలిగించుచున్నవి. ఇందు ప్రకృతినిగాని సూర్యోదయ చంద్రోదయాదులనుగాని, స్త్రీలనుగాని వర్ణింపవలసిన యక్కఱ నన్నయకుఁ గలుగలేదు.

**రసపోషణము :** నన్నయ నిగ్రహవంతుఁడు. అతఁడెచ్చటను భావములను బొంగి పొరలునట్లుగా వర్ణింపఁడు. భావనిగ్రహ మాతని రచనలో సర్వత్ర గోచరించుచుండును. ఎట్టి యెడరు దొడరినప్పుడైన నాతని పాత్రలు గాంభీర్యమును విడువక నిగ్రహముతో వర్తించుచుండును. దుశ్శాసనుఁడు కేశములు పట్టుకొని సభకీడ్చుకొనివచ్చినప్పుడు ద్రౌపదియు, వస్త్రాపహరణ సమయమున ధర్మజార్జునులును వర్తించిన తెఱంగిందుకు నిదర్శనము.

భారతము బహు విస్తృతమైన గ్రంథము. పలు విధములైన కథోపాఖ్యానములందు వర్ణింపఁ బడియుండుటచే నది నానా రసాశ్రయమై యుండును. ఇందలి అంగిరసము శాంతము. కవి దీనికి విరోధముకాని న్యూనతకాని కలుగకుండునట్లుగా నంగ రసములను వర్ణింపవలయును. అంగ రసములనే విపులముగా వర్ణించిన నంగిరసమునకుఁ బుష్టి తగ్గిపోవును. "విరోధినస్తు రసస్య అంగిరసాపేక్షయా కించిన్న్యూనతా సంపాదనీయా. న్యూనోహ్యంగభూతోఽంగినం బలీయాంసం బాధితుం న శక్నుయా దిత్యాశయః" అని ధ్వన్యాలోకమును దద్వ్యాఖ్యయు నుడువుచున్నవి. ఈ విషయమును బాగుగా నెఱింగిన వాఁడగుటచే నన్నయ యంగిరసమున కెక్కడను భంగము కలుగకుండ నంగరసములను బోషించియున్నాఁడు.

దుశ్శాసనుఁడు తన్ను సభలోని కీడ్చుకొని వచ్చినప్పుడు ద్రౌపది కోప లజ్జాపరవశయయి చేయునదిలేక తుదకు భీతయై కృష్ణుని దలంచెను. ఈ సన్నివేశము భక్తిరస ప్రకటమున కెంతో యనువైనది. ఇచ్చట భక్తిరస ప్రచురములైన పద్యము లెన్నో గుప్పించుటకు వీలున్నను నన్నయ "కోమలి కృష్ణుఁ దలంచె భీతయై" యని యొక్క వాక్యము చెప్పి యూరకుండెను.

శిశుపాలుఁడు కృష్ణు నాక్షేపించు సందర్భమున సహదేవుఁడు క్రుద్ధుఁడై కృష్ణున కర్ఘ్య మిచ్చుట కొడంబడక దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకముపై నిడియెద నని పల్కుచు సభలోఁ జరణమెత్తెను. దుర్యోధనుఁడు ద్రౌపదిని దన యూరుతలము నెక్కరమ్మని సన్నచేసిన సందర్భమునఁ గౌరవ కురంగ మృగేంద్రుఁడైన భీముఁ డల్కమై నాతని నాజి భగ్నోరువు నొనర్తునని శపథము చేసియుండెను. ఇట్లే వస్త్రాపహారణ సందర్భమున నతఁడు దుశ్శాసను వధించి యాతని రొమ్ము నెత్తురు నాస్వాదించెద నని పల్కెను. ఈ ఘట్టము లన్నియు రౌద్ర రసమును విస్తృతముగా వర్ణించుటకు వీలైన పట్లు. నన్నయ యట్లు చేయక వానిని సూచ్యములు కావించి విడిచిపైచెను.

సభాపర్వమున వీర కరుణాద్భుత రౌద్రరసము లాయా ఘట్టము లందుఁ జక్కగాఁ బోషింపఁబడినవి. వీరమునకు స్థాయి యుత్సాహము. నారదవచన ప్రేరితుఁడై ధర్మజుఁడు పితృప్రీత్యర్థమై రాజసూయ మొనర్ప నుత్సాహముచూపు సందర్భమున ధర్మవీరమున్నది. భీమార్జునాదుల దిగ్జైత్ర యాత్రను వర్ణించు సందర్భమున యుద్ధవీరము పోషింపఁ బడినది. ద్యూత పునర్ద్యూత ఘట్టములందు ధర్మజు నెట్లైన నోడించి రాజ్య మపహరింపవలె నను నుత్సాహము శకుని దుర్యోధనులం దధికముగా గోచరించును. అచ్చట పోషితమైన వీరముకూడ యుద్ధవీరమునందే యంతర్భవించును. భీముఁడు జరాసంధుని వధించు సందర్భమున రౌద్రము గోచరించును. ద్రౌపదిని దుశ్శాసనుఁడు సభకీడ్చుకొనివచ్చినప్పుడు భీముఁ డామెను జూచి దుఃఖితుఁడై ధర్మజుని బాహుదాహము చేయవలెనని కోపించి పల్కినప్పుడు రౌద్రాభాస మున్నది. భీమార్జునాదులు వనగమనసమయమునఁ గ్రుద్ధులై శపథము లొనరించు సందర్భము రౌద్ర రసమయమై యున్నది. దుశ్శాసనాకృష్టయై ద్రౌపది సభకరుదెంచి భీతయై కృష్ణుఁ దలంచు నప్పుడు భయానకరసము ద్యోతిత మగుచున్నది. నారదుఁడు దిక్పాలవిధాతృల సభలను వర్ణించు సందర్భ మద్భుతావహమై యున్నది. మయసభలో దుర్యోధనుఁడు సంవృత ద్వారమును వివృతమనియు వివృతమును సంవృతమనియు, నిర్జలప్రదేశమును సజలమనియు సజలప్రదేశమును నిర్జలమనియు భ్రాంతిపడి యవమానమునకు గుఱియైనప్పుడు హాస్యచ్ఛాయలు గోచరించుచున్నవి. పాండవులు ద్రౌపది

తోఁగూడ నడవి కరుగునప్పుడు కుంతి విలపించు ఘట్టము కరుణరస నిర్భరమై యున్నది. విదురుఁడు పాండవులు వనమున కేగిన తీరు ధృతరాష్ట్రునకు వర్ణించునప్పుడుకూడఁ గరుణరసము ద్యోతితమగుచున్నది.

పాత్రపోషణము : నన్నయ పాత్రపోషణమునఁ గృతహస్తుఁడు. అతఁడు సర్వపాత్రల స్వభావమును లెస్సగా నూహించిన వాఁడగుటచే వానిని సుస్పష్టరేఖలతోఁ దీర్చిదిద్దుచుండును. గాంభీర్యౌదాత్త్యము లాతని పాత్రలయందలి సామాన్య లక్షణములు. ధృతరాష్ట్రుఁడు ధర్మజ్ఞుఁడయ్యును సుతవశంగత వర్తనుఁడు. ద్యూతము కలహకారణమని యాతఁడెఱుంగును. అయ్యును దుర్యోధనుని ప్రీతికై యాతఁడు ద్యూతక్రీడ కనుమతియొసంగ వలసివచ్చెను. సభలో ద్రౌపదికి జరిగిన యన్యాయమును నిరోధింపకుండు టకుఁగూడ నాతని సుతప్రీతియే కారణము. ద్రౌపదిని బిల్చి వరము లిచ్చు టయుఁ బాండవులకు రాజ్యమును సమర్పించుటయు నాతనికిఁగల బంధు ప్రజాభిప్రాయ భీతిని బాండవులందంతర్గతమైన ప్రేమను సూచించుచున్నవి. సభాపర్వమున దుర్యోధనుని యీర్ష్యాళుతయు నభిమానధనత్వమును దుష్ట తయుఁ జక్కగా వర్ణింపఁబడినవి. దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులకు దుష్టచతుష్టయ మను ప్రతీతి కల్గించిన కథాభాగము సభాపర్వమునందే యున్నది. దుర్యోధనునికి ద్యూతమునందభినివేశము కలిగించి మాయా కౌశలముచే ధర్మజు నోడించుట శకునియొక్కయు, నీర్ష్యాళువై తండ్రిని ద్యూతమున కంగీకరింపఁజేసి సభలో ద్రౌపది నవమానింప యత్నించుట దుర్యోధనుని యొక్కయు, 'ఇదిసేయఁగాదని మది విచారింపక ' ద్రౌపది పుట్టములొల్వఁబూనుట దుశ్శాసనుని యొక్కయు, ద్రౌపదిని విగతవస్త్ర నొనర్చి సభకుఁ దెచ్చినను ధర్మవిరోధములేదని పల్కుట కర్ణునియొక్కయు దౌష్ట్యమును వేయివిధముల విశదీకరించుచున్నవి. నన్నయ ధర్మజుని ధర్మ పరాయణత్వమును, అర్జున నకుల సహదేవుల యగ్రజాశయానుగుణవర్తన మును, భీముని యమాయిక కోపమును, ద్రౌపది భక్తిపాతివ్రత్యాభిజాత్య ధర్మజ్ఞతా గృహిణీత్వములను జక్కగా వ్యక్తము చేసెను. భారత కథలో నధర్మము జరిగినప్పుడెల్ల జంకక ధృతరాష్ట్ర దుర్యోధనాదుల కట్లు చేయ రాదని ధైర్యముతోఁ జెప్ప సాహసించినవాఁడు విదురుఁ డొక్కఁడే. ఇది యాతని ధర్మపరాయణతను సూచించుచున్నది. ధృతరాష్ట్రుని కాతని

ధర్మజ్ఞతపై నమితమైన ప్రత్యయమున్నది కుంతికి గొడుకులపైని కోడలి పైని గలప్రీతి యతిమాత్రమైనది. సభాపర్వమున శ్రీకృష్ణుని భక్తపరాధీన తను, పాండవప్రీతిని, దుష్టశిక్షణ సామర్థ్యమును నన్నయ లెస్సగా వెల్ల డించెను. ద్రౌపదికి సభలో నవమానము కలుగకుండఁ గాపాడినవాఁడా సుజనత్రాణపరాయణుఁడే. భీమునిచే జరాసంధుని వధింపఁజేయుటయు, శిశు పాలుని స్వయముగా సంహరించుటయు నాతని దుష్టనిగ్రహణ దక్షతకు నిదర్శనములు. ధర్మజుని రాజసూయము నిర్విఘ్నముగా సాగిపోవుట కాతఁడు రక్షకుఁడై యుండుటయే కారణము. సభాపర్వమున శిశుపాల జరాసంధుల యౌద్ధత్యమును, సాత్వతిపుత్త్రి ప్రేమయు, మయుని కృతజ్ఞ తయు, నారదుని కలహాశనత్వమును, ప్రహ్లాదుని ధర్మపరాయణతయు, సంజయ భీష్ముల ధర్మపక్షపాతమును నిపుణముగా సూచింపఁబడినవి.

నన్నయ పాత్రలను బ్రవేశపెట్టునప్పుడే యుచిత విశేషణములచే వారి శీలములను సంగ్రహముగాఁ జెప్పివేయుచుండును "అతివరోద్ధ తుఁడు మహోద్భుత భూరిబలుండు చేదిభూపతి" (స. 1-110) "పాలిత దుర్న యుండు శిశుపాలుఁడు బాలుఁడు" (స-2-22) "ఖలుఁడు బృహద్రథాత్మ జుఁడు గర్వితుఁడు" (స-౧-118) "ఆయత భుజవీర్యులు, మాయాయోధులు, హంసడిభకులనువార లనిర్జేయులు పరస్పర స్నేహాయత్త సుచిత్తులు" (స-౧-'11) "ధర్మతనూజుండు ధర్మువు తప్పిన ధరణీతలంబెల్లఁ దల్లడిల్లు" (స-2-224) "అనుపమ దైవయోగహతుఁడయ్యు నవశ్యము ధర్మసంపదం దనరున కాని ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబుఁ దప్పఁ ద్రొక్కునె" (స-2-2!8,)(దుశ్శాసనుఁడు) భృశకోపనుఁడు, దుర్మదుఁడు, "విచారవిదూరు సుయోధనున్ – ఇమ్మనుజాధమున్ గుణవిహీను – మానధనాఢ్యుఁడైన భూపతి",. "వాసవాత్మజుఁ బంపు మిప్పుడ వాఁడు ధర్మవిదుండు (స-2-180); "పుత్రవత్సలుండు విచిత్రవీర్యాత్మజుఁడార్యుండు (స-2-157); ధర్మాధర్మవిదుండైన విదురుని కిది సమ్మతంబుగాదు (స-2-137); "ధీరమతి విదురుతోడ విచారింతవు వాఁడు నయ విశారదుఁడు కళాపారగుఁడు, దీర్ఘదర్శి, యపారహితారంభుఁ డుభయపక్షంబులకున్ (స-2-`24) "పరమ పతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధర్మరత నయోనిజం" (స-2-255) "అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు మెలతగా దీనియందు నిర్మించె నొక్కొ (స-2-160) మున్నగున విందుకుఁ దార్కారణములు,

సభావర్ణన సందర్భమున నన్నయ ధర్మజ దుర్యోధనుల శీలములను ప్రతియోగ దృష్టితోఁ జక్కఁగా నిర్దేశించెను. దుర్యోధనుఁడు శకునితోఁ దన శరీరకార్శ్యమునకుఁ గారణముఁ దెల్పుచు

భావిపురాతనాద్యతన పాండవలక్ష్ములు పొందవేయు ల
క్ష్మీవిభవంబుతోడ నుపమింప సమంబులుగా వశేషరా
జావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిఁ జూచియేఁ
జూవె సహింపనోపక కృశుండ వివర్ణుఁడనైతి నెంతయున్ ౨-114

అని తనయసహనమును వెల్లడించెను. దుర్యోధనుని ప్రీతికై ధృతరాష్ట్రుఁడు నిర్మింపఁజేసిన సభనుజూచి ధర్మరాజు "లక్ష్మీధరమూర్తి యెంతయునుమెచ్చె మనంబునఁ దద్విభూతికిన్" (౨-162). ఈ రెండు సందర్భములను బరిశీలించి చూచినచో ధర్మజ దుర్యోదనుల శీలములందలి తారతమ్యము విస్పష్టము కాఁజాలును.

**నన్నయ లోకజ్ఞత - మనస్తత్త్వ పరిశీలనము :** నారదుఁడు సభాగతుఁడైన ధర్మజుని జూచ నరుదెంచి రాజనీతికి సంబంధించిన విషయము లడిగి తెలిసికొనెను. ఈ సంపర్భమున నన్నయ వ్రాసిన పద్యములలోఁ గొన్ని యాతని స్వకపోల కల్పితములే అవియును సంస్కృత భారతమునుండి యాతఁ డనువదించిన రాజనీతికి సంబంధించిన పద్యములును అతని లోకజ్ఞతకు నిదర్శనములుగా నున్నవి.

జర బాలక శరీర శకలములు రెండిటిని గూడఁబట్టఁగనే యవి రెండు నొక్కటయ్యెననియు నప్పు డేర్పడిన బాలకుఁ డేడ్చెననియు నా యేడ్పువిని యంతిపురమునందలి ముదుసలియవ్వ లెల్ల రరుదెంచి మహా హర్షముతో వాని నెత్తుకొనిరనియు నన్నయ రచించినతీరు చాల సహజముగా నున్నది. రాణులు తమకు జనించిన దేహశకలములను సిగ్గున దాదులచే వెలపలఁ బాఱవేయించిరి. తరువాతఁ గొంత సేపటికి శిశువునేడ్పు వినిపించెను. ఆ శక లములే సజీవములై యక్లేడ్చుచుండె నేమోయని యంతిపురమందలి ముదు సలియవ్వ లరుదెంచి వాని నెత్తుకొనిరి. ఇది ముదుసలియవ్వల మనస్తత్త్వ మున కెంతయు ననుగుణముగా నున్నది.

శకుని దుర్యోధనుని మనస్తాపమునకుఁ గారణ మెఱిఁగి యాతని ధృతరాష్ట్రునొద్దకుఁ గొనిపోయి యతని శరీర కార్శ్య వైవర్ణ్యములు వర్ణించి చెప్పెను ధృతరాష్ట్రుఁడంత నదరిపడి కొడుకు నొడలంటి చూచెనని నన్నయ వ్రాయుట యాతని నిశితలోక పరిశీలనమునకుఁ దార్కాణము. అంధులైన వృద్ధులు తమకుఁ బ్రీతి పాత్రులైన వారియెడ సరిగా నిట్లే వర్తింతురు.

ద్రౌపది ప్రాతికామివెంట సభకరిగి కురువృద్ధు సమీపమున నుండెను. దుర్యోధనుఁడు దుశ్శాసనుని బిలిచి ద్రౌపదిని దోడ్కొనిరమ్మని సంపెను. నిర్దయాత్ముఁడును శాప నిరతుండునైన దుశ్శాసనుఁడింక వచ్చునని యెఱిఁగి ద్రౌపది భీతయై గాంధారి యొద్దకు నరిగెను. ఇట్లు వ్రాయుట నన్నయ మనస్తత్త్వ పరిశీలనమునకు నిదర్శనము. నిజమునకా సందర్భమున దుశ్శాసను నరికట్టఁగలవారు గాంధారితప్ప మఱెవ్వరును లేరు. అదియునుగాక గౌరవమునకు భంగము వాటిల్లునేమోయని భయము కల్గినప్పుడు స్త్రీలు వృద్ధస్త్రీల పజ్జకరిగి తమ మానగౌరవముల రక్షించుకొన నెంచుట మిక్కిలి సహజము.

దుశ్శాసనుఁడు ద్రౌపది కట్టినవలువలు విడ్చునప్పుడు "ఉడుగక యొలువంగఁబడియు మున్నపనీతమైన తద్వస్త్రంబు నట్టి వలువ లలితాంగి జఘన మండలమునఁ బాయక యొప్పుచు" నుండెనని నన్నయ రచించెను. ఒకేరకమైన వస్త్రము మరల మరల నుత్పన్న మగుచున్నయెడల నగ్నత భాసింపదు. ఇచ్చట పాయక అను శబ్దముయొక్క ప్రయోగము సాభిప్రాయము. అది అవ్యవధికముగా మఱొక వస్త్రము వచ్చుచుండెనను విషయమును సూచించుచు నన్నయ లోకజ్ఞతను వెల్లడించు చున్నది.

ధర్మరాజు జూదమాడుటకు ద్రౌపదితోడను అనుజులతోడను హస్తినాపురమున కరిగినపుడు గాంధారి కోడం డ్రెల్లరును ద్రౌపదినిజూచి 'అఖిల లావణ్యపుంజంబు నజ్జభవుఁడు మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ కాని నాఁడెట్టికాంతి యేకాంతలందు నేలలేదని సామర్ష హృదయులై 'రని నన్నయ వ్రాసియుండెను. ఇది స్త్రీ సహజమైన మాత్సర్యముతోపాటు వారు ద్రౌపదినిగూర్చి తమతమ భర్తలతో నేమేమియో చెప్పియుందురనియు. ద్రౌపదికిఁ దరువాత సభలో జరిగిన యవమానమున కదియు నొక కారణమై యుండుననియు ధ్వనింపఁ జేయుచున్నది.

పై విషయములన్నియు నన్నయ లోకజ్ఞతను వెల్లడించుచు నవతారికలో నాతఁడు తన్నుగూర్చి వాడిన లోకజ్ఞుఁడను విశేషణమును సార్థక మొనరించుచున్నవి.

నన్నయ శైలి: నన్నయకుఁ బూర్వమాతని కాదర్శములు కాఁదగిన తెలుఁగుకావ్యము లేవియును లేవు. అందుచేఁ గన్నడకవుల కావ్యములును సంస్కృత కావ్యములును ఆతని కొఱ్ఱబంతు లయ్యెను. కన్నడమున నంతకుఁ బూర్వము రచింపబడిన కావ్యములు తత్సమ బహుళములై మార్గపద్ధతిని రచింపఁబడి యుండెను. వాని ననుసరించి నన్నయయుఁ దన రచనలోఁ దత్సమ పదములను సంస్కృత సమాసములను ఎక్కువగా వాడియుండెను. తెలుఁగున నప్పటికుండిన పదసంపద యతి పరిమితమై యుండుటయు నందు కొక కారణము. నన్నయ సంస్కృత సమాసముల నెక్కువగా వాడినను వానిలోఁ గ్లిష్టత లేశమైన నుండదు. అవి ప్రసాదగుణముతో నిండారి యుండును. పాండిత్య ప్రకటనమునకై యాతఁడు మాఱుమూల పదముల నెచ్చటను వాడఁడు. తెలుఁగు వాఙ్మయమున నన్నయవలె సుందర పదబంధ మిలుగను అశ్లిష్టాన్వయములుగను సమాసములను వాడిన కవుల సంఖ్య చాల తక్కువ. సమాస ఘటితములైన యాతని పద్యములు కొన్ని ధ్వని గంభీరములై వేదఋక్కులవలె ధ్వనించుచుండును.

నన్నయ రచనమునఁ గొన్నిచోట్ల సంస్కృత వాక్యయోజన గోచరించును. అతఁడు సంస్కృతమునవోలె విశేష్యములను విశేషణములకు ముందును వెనుకను గూడ వాడుచుండును. విశేషణ విశేష్యములకు నడుమ నొక్కొక్కప్పు డితరపదముల వ్యవధానము సైతము గోచరించుచుండును.

పరమ పతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధ
ర్మరత నయోనిజన్ 2-255

కురుపతికిన్ యుధిష్ఠిరునకున్ సకలక్షితిపాల సేవ్యసు
స్థిర విభవాభిరామునకు ౧-5

సంస్కృతమునవలె యత్తదర్థక శబ్దముల ప్రయోగములతోఁ గూడిన వాక్యము లాతని రచనలోఁ బెక్కుచోట్లఁ గానిపించును

ఎందేని సర్వభూతేశుండు సృజియించె సచరాచరములైన జగములెల్ల
అట్టి బిందుసరమునందున ౧-9

ధర్మువెఱిఁగి దాని . . .

సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకువాఁ డనృత దోషఫలము
నను భవించు ౨-238

నన్నయ రచనమునఁ గర్మణి ప్రయోగము లచ్చటచ్చటఁ గన్పించును.
ఉడుగక యొలువఁగఁబడియు మున్నపనీతమైన వస్త్రంబు నట్టి వలువ ౨-23

వినఁగఁ జూడఁబడ వెవ్వరిచేన్ ౨-139

పరసంపద చేకొనఁగఁ బడుసేని ౨-142

నన్నయ తరువాతి కవుల కావ్యములలో నిట్టిప్రయోగము లంతగాఁ గానిపింపవు.

నన్నయ దాలంకారికమైన రచన. అతని యలంకారము లన్నియు ధారాళముగా నప్రయత్నముగా సమకూడినట్టివే. ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసము, స్వభావోక్తి మున్నగు నలంకారము లాతని రచనతో నధికముగాఁ గనిపించును.

నీరజమిత్రుఁ డేల ధరణీగతుఁడయ్యెడునొక్కొ ౧-23 ఉత్ప్రేక్ష
వరాప్సరోంగనాయత విలసత్కటాక్ష కుసుమార్చిత సుందర
వక్త్ర చంద్రుఁడై ౧-64 రూపకము

అవనితలంబు ప్రవస్సెనొ హిమాచలశృంగము ప్రయ్యలయ్యెనో
౧-213 ఉత్ప్రేక్ష

మానధనాఢ్యుఁడైన భూపతి సహియింప నోపునె సపత్నుల
వృద్ధియు నాత్మహానియున్ ౧-93 అర్థాంతర

అన్న! సహదేవ నీవును, నన్నలతో నరిగెదయ్య యట యడవులకీ
వున్నను సుతులందఱు నిం, దున్నట్టుల నాకుఁ జిత్తమూఱడి
యుండున్ ౨-288

అనునది యలంతి యలంతి పదములతోడను స్వభావోక్తితోడను గూడి కుంతి శోకమును గాఢముగా వ్యక్తము చేయుచున్నది నన్నయ సమయోచితములు భావస్ఫోరకములునైన యుపమానములను పెక్కుచోట్ల వాడియుండెను.

అయనయహీనుఁడొఁ సవితృనట్లు విఖండిత పక్షతిద్వయుం
డయిన ఖగేంద్రునట్లు ౧-161

పోరి రూర్జితభుజదర్పమేర్పడఁగ సింహగజేంద్రములట్లు వజ్ర
పర్వతములయట్లు ఘోరతరవాసవవృత్రుల యట్లు నిద్దఱున్
౧-206

నెట్టన ధర్మనందనుండు నిన్నవలంబముచేసి యోడతోఁ
గట్టిన యోడవోలె గతగౌరవుఁడై కడుదూలె ౨-40
బూతువొగడినట్లు పొగడెదు ౨-43

చండకౌశికుఁడు జరాసంధుని బలసామర్థ్యములను వర్ణించునప్పుడును ౧-158 మంత్రులు ధర్మజుని వైభవమును వర్ణించునప్పుడును (౧-273) నన్నయ వాడిన వచనములంవలి యుపమానములర్థగంభీరములును, ఔచిత్య శోభితములునై మిక్కిలి మనోహరములుగానున్నవి.

నన్నయ రచనమున నందందు శబ్దాలంకారములుకూడ గోచరించుచున్నవి. ఇందు వృత్త్యనుప్రాసముల సంఖ్య హెచ్చు.

"సటాసముత్పాటన కుపిత కుంజర వైరియుంబోలెఁ గడు
నలిగి కుటిల భ్రుకుటి ఘటితనిటలుం డగుచు" ౧—194

ఇందు టకారముతోఁగూడిన వృత్త్యనుప్రాసము జరాసంధుఁడు పండ్లు పటపట కొఱుకుచున్నాఁడాయను భావమును గలిగించుచు నతని క్రోధమును జక్కగా వ్యక్తము చేయుచున్నది. నన్నయ రచనమున నంత్యానుప్రాసము లెచ్చటను గానరావు కాని కొన్ని వర్ణనాత్మకములైన పద్యములలో దాని, దాని అనుపదములతో ముగియు విశేషణములు పెక్కుగాన వచ్చుచున్నవి.

ఉరుతర హార్మ్య మాలికలనొప్పు గిరివ్రజమన్పురంబు గాం
చిరి నవ సౌరభ ప్రసవ చిత్రవనావళి గల్గుదాని, నె
వ్వరికి దురాసదంబులగు వప్రమహోన్నత వప్రచారు గో
పురముల దాని నయ్యలకఁ బోలెడుదాని మహార్థసంపదన్ ౧-174

ఈ క్రింది పద్యమున నరిష్టశబ్దమునకుఁగల రెండర్థములను బురస్కరించుకొని నన్నయ చక్కని అర్థచమత్కారమును గల్పించియున్నాఁడు.

ధృతరాష్ట్రజునకుఁ బుట్టెనరిష్టమని రిష్టమునఁ దమలోనన్ ౨-253

ద్రౌపదీ పరాభవ సమయమున నుత్పాతము లుదయించినపుడు కృప విదుర శాంతనవు లిట్లనియుండిరి. మూలమున నీ సందర్భమున నమంగళము తొలఁగి స్వస్తియగుఁగాక యని వారనినట్లున్నది. నన్నయ స్వస్తి శబ్దమునకు బదు లరిష్ట శబ్దమును వాడియుండెను. అరిష్టశబ్దమునకు మేలు-కీడు అను రెండర్థములు నున్నవి. నిజమున కిచ్చట కీడనునదే వారి యభిప్రాయమైనను మేలను మూలార్థముకూడ స్ఫురించుచున్నది.

నన్నయ కొన్నిచోట్ల శబ్దములను సాభిప్రాయముగా వాడుచుండును. అట్టియెడ నా శబ్దములు పరివృత్తిని సహింపవు.

వాతసుతుండు వీచె...తృణఖండ సముండగుచుండ మాగధున్ ౨-209

తృణఖండ సముఁడైన మాగధుని వాయుసూనుఁడు వీచెనని స్ఫురింపఁ జేయుటకై నన్నయ వాతసుతుఁడను శబ్దమును సాభిప్రాయముగా వాడియుండెను.

దీని కొడంబడు మొడంబడవేని నేఁడ యీాక్షణమ సర్వభక్షుచేత భక్షితుండ నగుదు. ౨-126

ఇది దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునితో నన్నమాట. మానవుని దహించు సందర్భము కావున నగ్నికి సర్వభక్ష శబ్దమిచ్చట సాభిప్రాయమై యలరారుచున్నది.

కొన్నిచోట్ల నన్నయ వాడుచుండు పదములు సందర్భోచితములును బరమౌచిత్య భాసితములునై యొప్పారుచుండును.

ప్రాతికామి తన్ను సభలోనికిఁ గొనిపోవుటకై వచ్చినపుడు ద్రౌపది యాతనిఁజూచి

"మున్ను దనోడ్డుటువడి...... గ్రన్నఁదనోడ్డుటువడియెనో యన్న నా కెఱుఁగఁజెప్పుము"

అని "అన్న"యని సంబోధించుట యా సందర్భమున కెంతయుఁ దగి నిష్కరుణునికైన జాలి పుట్టించునదిగా నున్నది.

పాండవు లడవికేగునపుడు కుంతి సహదేవుని జూచి
"అన్న! సహదేవ నీవును నన్నలతో నరిగెదయ్య 2-288

అని 'అన్న' యను శబ్దమును వాడుట యామె కాతనియెడఁగల వాత్సల్యమును లెస్సగా సూచించుచున్నది. ఇట్లే భీష్ముఁడు ద్రౌపదితో "అవ్వా! నీ ప్రశ్నఁబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుఁడు సెప్పవలయు" 2-245 నని అవ్వా అని సంబోధించుట యత్యంతవాత్సల్యసూచకమై యున్నది.

సభాపర్వమున దుర్యోధనుఁడు రెండుసార్లే ధర్మరాజుతోఁ బ్రత్యక్షముగా మాటాడియుండెను. ఆ రెండుసార్లు అతఁడతనిని 'అనఘ' అనియే సంబోధించి యుండెను.

అనఘ ! మామామ శకుని మాకై కడంగి 2-174
అనఘ ! సుహృద్ద్యూతం బిందొనరింతము 2-164

నన్నయ పదప్రయోగము రసానుగుణమై యుండును. వీర రౌద్ర సందర్భములం దతఁ డోజోభరితమైన శైలిని, కరుణ శృంగారాదులందు మాధుర్య ప్రసాదభరితమైన శైలిని వాడుచుండును. భీముఁడు ప్రతిజ్ఞలు చేసిన పద్యములను, కుంతి పాండవ వనగమన సందర్భమున దుఃఖించునప్పటి పద్యములను బరిశీలించిన నీ విషయము తేటతెల్లమగును.

నన్నయ తన రచనలో నక్షరరమ్యత యుండునని తెల్పియుండెను, అక్షరరమ్యత యనఁగా, సర్వ సందర్భములందు లలిత మధుర శబ్దములను

మాత్రమే వాడుటకాదు. రసోచితముగా శబ్దములను వాడినప్పుడే యక్షర రమ్యత యేర్పడుచుండును. ఆ రమ్యత రససంబధియేకాని కేవలపద ప్రయోగ సంబంధికాదు.

నన్నయ రచనయందు ధారాశుద్ధి సర్వతోముఖముగా గోచరించు చుండును. ఆతని పద్యము లెక్కడను గుంటువడక నిరర్గళగమన సౌందర్య ముతో సాగిపోవుచుండును. అందుచేతనే ఎఱ్ఱన "నన్నయభట్ట కుంజరం బెన్న నిరంకుశోక్తిఁగతి నెయ్యెడఁ గ్రాలుట ప్రస్తుతించెద"నని యాతనిఁ గుంజర ముతోఁ బోల్చియుండెను. "మదమాతంగ తురంగకాంచన" (2-18) "రయ విచలత్తురంగమ తరంగములన్" (2.33) "ప్రకటితకోపవేగమున" (2-51) "కనకోర్వీధరసానుసార" (2-297) మున్నగు పద్యము లిందుకు దృష్టాంత ములు.

సాధారణముగాఁగావ్యమునందలి శైలి కథనశైలి,వర్ణనశైలి, సంవాద శైలి యని మూఁడు తెఱఁగులుగా నుండును. నన్నయది ప్రధానముగాఁ గథన శైలి. అతఁడు పెక్కుచోట్లఁ గథకుఁడు కథను జెప్పునట్లుగాఁ దటస్థుఁడై కథ లను చెప్పుకొనిపోవుచుండును. అతఁడు వర్ణన సంవాదశైలులను బ్రయోగిం చిన భాగములును లేకపోలేదు సభావర్ణనాదుల సందర్భమున వర్ణనశైలియు, శిశుపాలవధ ఘట్టమున సంవాదశైలియు గోచరించుచున్నవి. శిశుపాల వధ ఘట్టము పాత్రల యుక్తి ప్రత్యుక్తులతోఁగూడి దృశ్యకావ్య భాగమువలె సాగిపోయినది.

నన్నయ ప్రధానముగా మార్గ కవితా సంప్రదాయమునే యనుసరించి నను దేశీయ వృత్తములను దేశీయములు జాతీయములునైన పలుకుబళ్ళను బలుచోట్ల వాడియుండెను. సీస గీత మధ్యాక్కరాదుల ప్రయోగ మాతని దేశీయ వృత్తాభిమానమునకు నిదర్శనము. ఈ క్రింది ప్రయోగము లాతని జాతీయపద ప్రయోగ కౌశలమును సూచించును.

ప్రీతి నెత్తికొనియెన్ మహినెత్తిన పుణ్యుఁడున్నతిన్ 1-102
ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తురభీష్టములైన కార్యముల్
మతినొనరింతు రిష్టుఁడని మంతురుగాక 2-10

ఇమ్ముగ దివెట్టి వీనిఁ బరమేశ్వరుగాఁగొనియాడె ౨-39
పొగడుచునున్న నీ నాలుకయొక్కఁ డయ్యు బ్రయ్యవలయు నూఱు
బ్రయ్యలుగాఁగ నట్లయినఁగాని చాలవతనిఁ బొగడ ౨-41

నన్నయ అరణ్యపర్వమందలి కొన్ని ఆశ్వాసముల యంతములందు రమ్యరమణీయ పదములను వాడినట్లే సభాపర్వ ప్రథమాశ్వాసాంతమున "అని వైశంపాయనోక్త కథ రసోత్కటముగ" అని రసోత్కట పదమును వాడి యుండెను. ఈ పదముల ప్రయోగ మాతఁడు తన రచనను రమణీయముగను రసోత్కటముగను జేయవలెనని యుద్దేశించినట్లు స్పష్టము చేయుచున్నది. "ప్రసన్న కథా కలితార్థయుక్తి" అను సమాసముకూడ నాతని రసదృష్టిని వ్యక్తము చేయుచున్నది. ప్రసాదగుణము సర్వరస సమర్పకమైన గుణమగు టయే యిందుకుఁ గారణము. తెలుఁగున పద్యరచనకువలెనే గద్యరచనకును నన్నయ ఆద్యుఁడని చెప్పవచ్చును. అతని వచనములు ధారాళములై, వర్ణన సందర్భములందు దీర్ఘసంస్కృత సమాస భూయిష్ఠములై, నాతిదీర్ఘములై యతిమనోహరములుగా నుండును ద్రౌపది ధర్మవిజితయా అధర్మవిజితయా యను సందర్భమున వికర్ణుఁడును కర్ణుఁడును బల్కినపల్కులు హేతువాద పూర్వకములై వాది ప్రతివాదుల పక్షము లవలంబించి న్యాయవాదులొనర్చు వాదములవలె నున్నవి. నన్నయ గద్యపద్యముల వాడు సందర్భమున విచక్షణత ప్రదర్శించుచుండును. నీరసములు, విషయప్రధానములు, నామాది కథనప్రయోజనములునగు నంశముల నాతఁడు సాధారణముగా వచనము ననే చెప్పుచుండును. గద్యమునందైనను బద్యమునందైనను గాంభీర్యము, ధారాశుద్ధి, అన్వయసౌలభ్యము, అర్థవైశద్యము అనునవి నన్నయ శైలి యందలి ప్రధానలక్షణములు.

**నన్నయ భాషాఛందఃప్రయోగము:** సంస్కృత పదములను దెనుఁగున వాడు విధానము నిశ్చయించి, తనకుఁ బూర్వము శాసనములందును జన వ్యవహారమునందును గల తెలుఁగు పదముల రూపమును స్థిరపఱిచి యాంధ్ర భాషకు రూపసౌష్ఠవమును బదవిస్తృతిని గలిగించుటద్వారా మహాకావ్యోప యోగ్యతను జేకూర్చినవాఁడు నన్నయయే అందుచేతనే యతనికి వాగను శాసనుఁడను సార్థకమైన బిరుద మేర్పడినది. అతని సభాపర్వమునఁ గనవచ్చు భాషాప్రయోగవిశేషములలో ముఖ్యమైనవానినిమాత్రమిచ్చుటఁ బ్రదర్శింతును.

1. అమ్మునిప్రవరు పృథూత్సంగతలముపై వడిఁబడియెన్ ౧-42
ఇచ్చట ముని ప్రవరు అను సంస్కృత సమాసమున రేఫయుక్త సంయుక్తాక్షరమైన ప్ర అనుదానికి ముందున్న ని అనునక్షరము లఘువుగానే యున్నది.

2. అను, విను, కను అను తద్ధర్మ విశేషణముల తుదియుకారము వైకల్పికముగా లోపించును. గిరివ్రజమన్పురంబు ౧-172. ఇచ్చట పకారమునకు సరళాదేశము రాని కతమున ఉ లోపింపఁగా మిగిలిన రూపమందలి తుది నకారము ద్రుతముకాదని తెలియుచున్నది.

3. చనుధాతువునకు ప్రథమపురుష తద్ధర్మైక వచనరూపము చనును. చివరి ను ప్రత్యయము ద్రుతమగుటచే లోపింపవచ్చును. నన్నయ ధాతువునందలి ను లోని ఉకారమునకుఁగూడ లోపము కలిగించి నాఁడు.

విప్రసతికి నిూఱు వేఁడజన్వరములు ౨-263 (వేఁడజనును)

4. అచ్చుపరమగునపు డేని యందలి తుది యిత్వమునకు లోపము వైకల్పికము.

ఎందేనిట్టి సభ చూచియెఱుంగుదురే ౧-57

పక్షమున ఎందేని నిట్టి సభ

నన్నయ నేని యను హలాది పదమునుగూడ వాడియుండెను.
నీవునుజూచి తట్టి సభ నేని వినంబడ దేయుగంబులన్ ౨-95

5. చోరభయవర్జితముగా ధారుణి వాలింతె, ౨-41 ఇచ్చట తత్సమము మీఁది తత్సమ పరుషమునకు (పకారమునకు) గసడద వాదేశము కలిగినది.

6. నలుశబ్దమునకుఁ గ్రోత్తశబ్దమునకువలెనే తొలియచ్చు మీఁది వర్ణములకు లోపమును మీఁది హల్లునకు ద్విత్వమును గలుగును.
చిత్రరథుఁడనువాఁడు నన్నూఱు గంధర్వహయంబులనిచ్చె ౨-113

7. నీవు మూర్ఖవు శిశుపాల (2-21) మూర్ఖశబ్దమున డుజ్లోపము
బలిమిఁగొనిన ధనము పదివేలు లొట్టియల్ 2-567
నన్నయ ఎ దంత రూపములనుగాక యియాంత రూపములనే వాడి యున్నాఁడు. దీనినిబట్టి యివియే ప్రాచీనతరములుగాఁదోఁచును.

9. రాహుపర్వంబు గాకయ భానుఁబట్టె 2-298
రాహుశబ్దము వు వర్ణకహితముగా వాడఁబడినది.

10. ఋత్విజుండని విచారించి పూజించితే, 2-11 నన్నయ భారతమున ఋత్విక్కు అను రూపములేదు.

11. సదంబు 2-15 సదస్సను రూపము నన్నయ వాడలేదు.

12. శూరులెందు నీయట్టిరే. 2-236. అట్టి + వారు-తచ్ఛబ్ద వకారమునకు లోపము చేయఁబడినది.

13. సుందరి నా కోడండ్రురయం దభ్యర్చితవు నీవ 2-257
కోడండ్రు + రు. బహువచనముపై బహువచన ప్రత్యయము.

14. తృతీయాచతుర్థ్యర్థములందు నన్నయ మై, పొంటె అను ప్రత్యయము లను వాడియున్నాఁడు.

పూవులుఁజందనంబుఁ జనునె బలిమిమైఁగొనితాల్ప 1-151
కార్య సంప్రయోగము పొంటెన్ 1-26

అనఘ మామామ శకుని నాకై కడంగి (2-172) అని నన్నయ చతుర్థ్యర్థమున కై అను ప్ర త్య య ము వాడినాఁడు కాని యది కు + అయి (ఐ) అను వాని కలయికవలన నేర్పడినది. పైప్రయోగమున అ కును కై లోని ఐకిని యతి వేయఁబడినది. నన్నయ తదర్థమను దానినిగూడఁజతుర్థ్యర్థమున వాడియున్నాఁడు.

నీతదర్థంబులై నిఖిలవేదంబులు వర్ధిల్లు (1-253)

నీ కొఱకై యని యర్థము. తదర్థంబులై అని బహువచనాంతముగా వాడఁబడుటచే నది యప్పుడప్పుడే ప్రత్యయత్వమును బొందుచుండె

నని తోఁచును. నాతదర్థ మాచరింపుము బ్రహ్మచర్యవ్రతంబు (అర. 1-275) అను ప్రయోగమీ యభిప్రాయమును స్థిరపఱుచుచున్నది.

15. అతని పుట్టిన విధమెట్టుచెప్పు 1-'333 కర్తృపదప్రథమకు షష్ఠి

16. లో అను ప్రత్యయము మీఁద సప్తమీ విభక్తి ప్రత్యయములైన అందు, న అనునవి చేరుచున్నవి.

జంభకుండను వాని భూరిబలుని పుత్త్రుఁ బోరిలోన నొడిచి 1-246

17. నన్నయ భారతమున మొదలిటి యనియే కాని మొదటి అను ప్రయోగము కానరాదు. మొదలిటి సంపదలతో సమూలంబ చెడున్ 2-202

18. ఏవగింపక చేకొనుం డిదె యెల్లయందును ధర్మసద్భావ మొక్కని 2-236. ఇచ్చట అందు సప్తమీ విభక్తి ప్రత్యయముగాఁ గాక స్థల వాచకముగా వాడఁబడినట్లు తోఁచుచున్నది.

19. భవత్పునర్దర్శన మయ్యెడమరుగుండని 2-283 కేతన దీవన కెడమయుఁ గాతయుఁ గావుతయు నగునని తెల్పెను, వ్రాఁత ప్రతులలో ఎడమనురూపమే కనవచ్చుచున్నది. తరువాత నది ఎడుగా మాఱినది.

20. ఆయుధంబులున్నవలనికి దృష్టులు సలుపుచు 2-250 సలుపుచుననఁగాఁ బ్రసరింపఁజేయుచు నని యర్థము.

21. ధీరమతి విదురుతోడ విచారింతము 2-124 ఇచ్చట విశేషణము తృతీయకుఁ బ్రథమ వాడఁబడినది.

24. పదునాలుగు వేలు గజంబులన్ 2-111. పదివేవురు విప్రుల కొప్ప 1-14. సంఖ్యా విశేషణములు ముందువాడఁబడుటచే వాని ద్వితీయా షష్ఠులకుఁ బ్రథమ వాడఁబడినది.

25. దెప్పరములు పల్కఁగాఁదగునె 2-255 దెప్పరములు దెప్పరపు మాటలు. విశేషణము విశేష్యలక్షకమైనది.

26. తమ్ములు దానును జాదచారియై ౨-94. ఆత్మార్థ మభిహిత మగు టచేఁ దల్లింగ సంఖ్యాభిధాయి వచనము విశేషణమున కైనది.

27. అనఘ వినఁగవేడ్కయైనయదియు ౧-352 ఇచ్చటసముచ్చయార్థకము లేకున్నను అర్థమునకు భంగము కలుగదు.

ఛందస్సు : కన్నడ కవులు సంస్కృతమునందలి మత్తేభ శార్దూలాది వృత్తములను గ్రహించి యందుఁ దమ భాషకు సహజమైన ప్రాసనియమమును జేర్చి కావ్యములందు వాడుకొని యుండిరి. కొన్నిచోట్ల వారు సంస్కృత వృత్తముల పేర్లు మార్చి వానికిఁ గ్రొత్త పేర్లు పెట్టియుండిరి. నన్నయయుఁ గన్నడ కవులవలె సంస్కృతమునుండి వృత్తములు గ్రహించి వాని యందుఁ దెలుఁగు ఛందమునకనుగుణముగా యతిప్రాసలను జేర్చి రచన కావించి యుండెను. అతఁడు వారివలె మానిన్యాదివృత్తముల పేర్లు మార్చక వానిని సంస్కృతమునందలి పేర్లతోనే వ్యవహరించి యుండెను.

నన్నయ సభాపర్వమున 45 సీసపద్యములు వాడెను. అవి అన్నియు నాటవెలఁదులతోనే కూడియున్నవి. సీస గీతములందలి యతి, ప్రాస యతులను బట్టి సీసములను 16 రకములుగా విభజించవచ్చును వానిలో నన్నయ 13 భేదములను మాత్రమే వాడి యుండెను.

సీస పాదములందు యతి, ప్రాసలును గీత పాదములందు ప్రాస,యతులును; సీసపాదములందు ప్రాస, యతులును గీత పాదములందు ప్రాసయు; సీసపాదములందు ప్రాస, యతులును గీత పాదములందు యతి, ప్రాసలును గల మూడు భేదములను అతఁడు వాడి యుండలేదు.

సభా పర్వమున రెండు మధ్యాక్కర లున్నవి. నన్నయకుఁ బూర్వమందలి బెజవాడ శాసనమందలి మధ్యాక్కరలలో యతి పంచమ గణము మొదట వేయఁబడినది. దాని ననుసరించి నన్నయ కూడ నచ్చటనే యతి పాటించియున్నాఁడు. ఎఱ్ఱన చతుర్థగణాదినియతి వేసియున్నాఁడు. లాక్షణికు లందఱును ఎఱ్ఱన పద్ధతినే యాదరించియున్నారు. యతి విషయమున నీ మార్పు బహుశః నన్నయ ఎఱ్ఱనల నడిమికాలమునఁ గలిగియుండును.నన్నయ సభాపర్వమున 4 తరలలను, 5 మత్త కోకిలలను, 1 తరువోజను, 1 మాలినిని

1 రథోద్ధత వృత్తమును,1 అంబురుహ వృత్తమును.2 ఉత్సాహములను వాడీ యుండెను. మిగిలిన వన్నియు సామాన్య వృత్తములే. పై వానిలో నంబురుహము ప్రథమా శ్వాసాంతముననను, రథోద్ధతోత్సాహములు ద్వితీయా శ్వాసాంతమునను గలవు. నన్నయ సాధ్యమైనంత వఱకు వృత్తౌచిత్యమును బాటించినట్లు గోచరించును. అతఁడు వీర రౌద్రరసములను సూచించుటకు మ త్తేభ శార్దూలములను వర్ణన, కథాకథన, వ్యక్తి స్థలవస్తు నామ ప్రకటనములకు సీసమును, సంభాషణ సందర్భములందు వేగ గమనము గల తరలామత్త కోకిల లను వాడుచుండును. కందము నాతఁడాశ్వాసాంతములందును, నీతి ధర్మ కథ నమునకును వినియోగించుచుండును.

ఋ కారమునకు క ష ల కు సంబంధించిన యే యక్షరముతో నైన యతిమైత్రి పాటింపవచ్చును. కాని నన్నయ కకారమునకు సంబంధించిన యక్షరముతోడనే యతి వేయుచుండును (౧-138 ; ౧-161). అతఁడు తద్భవ వ్యాజ విశ్రమములను గాని, విశేష వళులనుగాని, మవర్ణము వర్ణ విరామములనుగాని వాడియుండలేదు రకారము రెండవ హల్లుగా నుండు సంయుక్తాక్షరములలో పై హల్లునకును, పూర్వాంగముగా నుండు సంయుక్తాక్షరములలో క్రింది హల్లునకును నన్నయ సాధారణముగా యతి పాటించుచుండును.

భాషా విషయమునఁ గాని ఛందోవిషయమునఁ గాని యాంధ్ర కవుల కాతని ప్రయోగములు శిరోధార్యములు అందుచేతనే అప్పకవి

ఆమూఁడు పర్వములలో
నామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్ (అప్పక. 47

అని నుడివి యున్నాఁడు.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ఆంధ్ర మహాభారతమును సంశోధించి సవిర్శకమైన ప్రతిని ప్రకటించుచున్నారు. నేనీ సంపుటమున వారి ప్రతి యందలి పాఠములనే గ్రహించితిని. పాఠాంతరములు మేల్త

